# పాండవోద్యోగము

(ఆఱంకముల నాటకము)



ఇది

శ్రీ తిరుపతి వేంకట కవులచే

రచియింపఁబడినది.



ప్రచురణ :

భువన విజయం పబ్లికేషన్స్

"సౌందర్య లహరి"

కస్పావారి వీధి, గవర్నర్ పేట, విజయవాడ-520 002.

# ఉపోద్ఘాతము

## ప్రథమ ముద్రణము

చదువరులారా !

ఈ యుద్యోగనాటకము విజయమునుండి వెడలించినదనియు నిందలి , 5, 6 అంకములు పునస్సృష్టియనియు 3 అంకములు వెనుకటికన్నఁ గొన్ని నావశ్యకములను జేర్చుకొన్నవనియు నన్ని నాటకములందుంబలెఁ దగుపాటి మార్పులే తప్ప నిందేకపత్నీవ్రతులు బహుపత్నీవ్రతులుగను వీరు వారుగను మార్చిన నూతనాంకములు లేవనియును దామే గుఱుతింపఁగలరు. అభిమన్యుని వివాహానంతర గాథనెత్తుకొని ప్రథమదినయుద్ధ ప్రారంభమువఱ కిందు భారతోద్యోగ మముద్రింపఁబడిన దనుట పేరువల్లనే తెలియనగు, యుద్ధప్రారంభతిథి నిర్ణయ విష యమును గూర్చి విజయపీఠికలో విస్తరించి చర్చించి యున్నారము. తుదకు నమా వాస్యాపక్షమును ఖండించి దశమీపక్షము సిద్ధాంతీకరించియుంటిమి. కాని మరల దశమీపక్షమునకు నొకింత బాధించు నంశములు నేఁటికి రెండుమాత్రము కనుపట్టు చున్నవి.

శ్లో. సప్తమాచ్చాపి దివసా, దమావాస్య భవిష్యతి
సంగ్రామో యుజ్యతాం తస్యాం, తా మహుశ్శక్రదైవతాం.

పై సంగతి యమావాస్యవారి కుపకరింపకున్నను మాకపకృతి నొనరించుటకు సిద్ధముగనున్నది. ఉండుఁగాక ! ఈ విరోధమిట్లు వారించుకోఁదగు నేమో యోజిం చెదు. ఇది భారతసంశయము. దీని నల్పబుద్ధు లగుమాబోటు లౌకరిద్దఱు మాత్రమే

నిర్ణయింప నశక్తులనుట స్వభావోక్తి. కాన మీరెల్లరును సహాయులై తోఁచిన యంశములను దెలుపఁ బ్రార్థితులు. శ్రీకృష్ణుఁడు కర్ణునితో "నింక సుమారుగా చేత నైన యుద్ధమునకు వెనుదీయని సుయోధనుఁడు కర్ణుని సాయములేకున్నను యుద్ధము మానువాఁడు గాఁడని సమాధానము చెప్పికొనఁగుఁ గాని యిది మాకేగాక లోకులకుఁ గూడ నంత తృప్తికరమగు నుత్తరము కాదనుకొనియెదము. మఱియు నర్జునుని రణసాధనములు మాత్రమే దివ్యములని సుప్రసిద్ధము. మఱికొందఱివి కూడను న్నను యావత్సాధనములు గూడ దివ్యములైనట్లు వినము. అట్టిచో నభిమన్యు ప్రభృతుల రణసాధనములేకాక ద్రౌపదేయులవియుఁ దక్కిన పార్థులవియుం గూడ దివ్యములైనట్లు ఱీశ్లోకములు చెప్పుచున్నవి.

సౌభద్రాదీన్ ద్రౌపదేయాన్ కుమారాన్
సహస్త్యశ్వా దేవదత్తా బృహస్తః
మాద్రీసుతం నకులం త్వాజమీఢం,
మహేంద్రదత్తా హరయో వాజిముఖ్యాః.

ఆ యీయంశములన్ జర్చించినచో మిగుల విస్తరించి వ్రాయవలసియుండునని ప్రకృతమింతతో విరమించుచున్నారము ఏమైనను దశమీ పక్షమే బలవత్తరమని మాయభిప్రాయము.

నేఁటికి దైవానుదహము వలనఁ బాండవవిజయమున నున్న పొరపాట్లు సాధ్యమైనంతవఱకు సవరించి ముఖ్యాంశములు చేర్చి రెండు నాటకములుగాఁ బ్రక టించితిమి. మఱియును సరస్వతిలోఁ బ్రకటింపఁబడిన బాలరామాయణాదులలోఁ బ్రమాదవశంబునఁ బడిన హెచ్చుతగ్గులను గూడ రెండవకూర్పున నిట్లే సవరింప వలసియున్నది. అచిరమ్మునన సవరింతుము. ఇందు సాధ్యమైనంతవఱకు ముఖ్య ములగు తప్పులు శుద్ధపత్రమున దిద్దఁబడియున్నవి. స్వల్పము లుపేక్షింపఁబడియె. విజయమున "కృష్ణజయిష్ణు" అను పాఠమును "గృష్ణనిజిష్ణు" అని దిద్దికోఁదగు మఱియు నశ్వమేధమున "తే. గీ. వీరచిత్రాంగద విచిత్రవీర్యులకు" అను పద్య మిట్లుమార్చి చదువఁదగు.

తే. గీ. వీర! వీరార్చిత ! విచిత్రవీర్యునకు వి
వాహ మొనరించితివి కష్టపడిజయించి
అతఁడు నేఁటికిఁ బ్రత్యుపకృతిగ నిట్టు
లాచరించెను నావంటియధముకతన.

అని దిద్దఁదగు—ఇఁకఁ బ్రకృతమగు నీ యుద్యోగమున—ఖాయము. తరపు అనుపడము లన్యదేశములేయైనను సమ్మతించియౌచిత్యమునకై యపేక్షపడి ప్రయోగించినవిగా రసవిదు లెఱుఁగుదురుగాక. తక్కిన లోపములు దయాదువులగు మీరే దిద్దికొనఁ బ్రార్థింపఁబడుచున్నారు.

ఇట్లు
తిరుపతి వేంకటేశ్వరులు

# ఇందు వచ్చు పాత్రలు :

**1వ అంకము**

1. సూత్రధారుఁడు
2. మారిషుఁడు
3. అర్జునుఁడు
4. దుర్యోధనుఁడు
5. శ్రీకృష్ణుఁడు

**2వ అంకము**

1. కృష్ణుఁడు
2. పంచపాండవులు
3. ద్రౌపది

**3వ అంకము**

1. వృద్ధపురోహితుఁడు
2. ద్వివేది
3. ధృతరాష్ట్రుఁడు
4. భీష్ముఁడు
5. నారదాదులు
6. శ్రీకృష్ణుఁడు
7. ద్రోణుఁడు
8. కర్ణుఁడు
9. దుర్యోధనుఁడు
10. అశ్వత్థామ
11. వికర్ణుఁడు
12. గాంధారి
13. జమదగ్ని
14. జాబాలి
15. విదురుఁడు
16. కృపాచార్యుఁడు
17. దుశ్శాసనుఁడు
18. సాత్యకి

**4వ అంకము**

1. శ్రీకృష్ణుఁడు
2. కుంతి
3. కర్ణుఁడు

**5వ అంకము**

1. పంచపాండవులు
2. శ్రీకృష్ణుఁడు
3. ఉలూకుఁడు
4. రుక్మి
5. పురుషుఁడు
6. ఫణిహారి

**6వ అంకము**

1. కృష్ణుఁడు
2. పంచపాండవులు
3. భీష్ముఁడు
4. ద్రోణుఁడు
5. కర్ణుఁడు
6. యుయుత్సుఁడు

శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవోద్యోగము

## నాటకము

### నాంది

శా. ధర్మజ్ఞుం దరిభీముఁ డర్జునయశోధాముండు పాపప్రభా
మర్మోచ్ఛిత్తియమాయమాననిజనామప్రాభవుం డార్తహృ
చ్ఛర్మోదారుఁడు విశ్వరూపధరుఁ డుచ్చైశ్శ్రీవదాన్యుఁడు స
త్కర్మాధ్యక్షుఁడు పార్థసారథి యశఃకల్యాణముల్ గూర్చుతన్

సూత్రధారుఁడు : నాంద్యంతమునఁ బ్రవేశించి మారిషా! ఇటురమ్ము.

మారి : ప్రవేశించి ఇదిగో! వచ్చితి నేమియాజ్ఞ?

సూత్ర: పాత్రంబుల నన్నిటి నాయత్తపఱచితివి గదా?

మారి : చిత్తము, సర్వము సంసిద్ధముగనే యున్నది గాని మన పాత్ర మలయం దొక్కరుఁడుమాత్రము మన ప్రతిపక్షిపంచనకు లోఁబడి మనలన్ద్యజించి యరిగె.

సూత్ర: తత్తరపాటుతో ఎవ రతఁడు?

మారి : అన్యుఁడు కాఁడు, తమ మేనమామయే.

సూత్ర: (కోపముతోఁ దనలో ఓరీ! ప్రతిపక్షి! ఎంతపని చేసితివి?

ఉ. మున్ను సుయోధనుండు నృపముఖ్యుని ధర్మజు భాగినేయుఁ గూ
డ న్నెఱిఁబోవు శల్యునిఁ గడంగి యెటో యొకయు ( ఇన్ని తాఁ

గ్రన్నన్ దన్నుఁ జేర్చికొనుకై వడి నాదగు మేనమామ న
త్యున్నత నాఁచికొంటివె నతల్ పచరించి హితుం బొనర్చుచున్.

యోజించి తలపంకించి కానిమ్ము నీ కతఁడు సమయము వచ్చినప్పుడం తశ్శల్యాయమానుండై తుట్టతుద కపకృతియే యొనర్చునట్లు నానేర్పుకల్మిని సంఘటించెదఁ గాక. ప్రకాశము మారిషా! అతఁడు లేకున్నను మన నాటకప్రయోగము కొఱఁతపడదు. అతని భూమికను ధరింపఁదగువారు మఱికొందఱు గలరు. ఏమైనను అతని వంటివాఁడు సామాన్యముగా మనకు లభించుట దుర్లభము. ఔఁ గాక, గతించినదాని కేమి సేయఁ గలము? ఏకాలమున కేది యెట్లు జరుగునో యెవరికిఁ దెలియును. సర్వమును కాలమే సంఘటించుచుండును.

మారి : చిత్తము! తాము వచించినట్లు కాలము ప్రతిక్షణమందునను నేదోమార్పు కల్గించుచునే యుండును: చూడుఁడు.

ఉ. భీమధనంజయప్రభ లభీమము లయ్యెను; బుష్పపల్లవ
స్తోమముఁ బాసి యుండె సహదేవకుజంబు వనంబులోన; వ్యా
యామభరంబునన్ ద్రుపదజాయతబాష్పఝరంబు నిండె; సం
గ్రామదినంబులున్ దరిసెఁ గాలజధర్మము దాఁటలేమిచేన్.

సూత్ర: అవును, నీవు చెప్పిన వన్నియు శరత్కాలజన్యంబు లగుమార్పులు కాలము సర్వకారణ మని యార్యులెల్లరును నేకవాక్యతగా నొప్పుకొనిన విషయము.

ఉ. కాలవశంబునన్ దిరుగుఁ గాదె! దివాకరుఁ డబ్జవైరియున్,
గాలవశంబుచేతనె జగంబు జనించు, రహించు, గ్రుంగు; నీ
కాలమె కల్మిలేములకుఁ గారణ; మెన్నిట నెన్ని చూచినన్
గాలము దాఁటువాఁ డిల నొకండును లేఁడు కుశీలవాగ్రణీ!

కానిమ్ము; "గతం నశోచామి కృతం స్మరామి" కావునఁ బ్రకృత మనుస

రింపుదము. (యోజించి నేఁడు నామాతులుం దన్యపక్షము నకుఁ బోయినను మనము ప్రయోగింపవలసిన నాటకము పాండవోద్యోగ మని తనవర్తనచే సూచించియున్నాఁడు. కాని యీ నాటకచక్రమును ద్రిప్పఁగలవాడు నా బావ మఱఁది మురళీదాసు. అతనిని నీవు పోయి వెంటఁబెట్టుకొని రమ్ము.నే నింతలో నీ నాటక కర్తలగు తిరుపతి వేంకటేశ్వరుల గురవగు శ్రీచర్ల బ్రహ్మాపండితాఖండలుని సంస్మరించి తత్ప్రసాదంబు వడసి వచ్చెదను.

మారి : చిత్తము నిష్క్రమించును .

సూత్ర: (అంజలి ఘటించి

శా. కాశీపండితుఁడై కృపాళుఁ డయి ప్రఖ్యాతిప్రభాపూర్ణుఁడై
యాశీర్వాదముమాత్ర శిష్యులను విద్యావంతులన్ జేయువా
గ్వైశద్యమ్మునఁ బొల్చుచర్లకులజున్ బ్రహ్మయ్యశాస్త్రిన్ గళా
రాశిన్ శ్రీకడియెద్దవాసు మది నారాధింతు నశ్రాంతమున్.

(నిష్క్రమించును)

ం ం ం

ఇది ప్రస్తావన

అంత నర్జునుఁడు ప్రవేశించును.

అర్జు : తనలో

చ. ద్రుపదునిపంపునన్ జనెఁ బురోహితుఁ; డాధృతరాష్ట్ర సూతి బల్
కపటి వినండు సంధి చెడఁగా గమకించెడిఁగాని, తప్ప దా
లపుఁబని; సర్వమున్ గడపులావు గలండు యశోదపట్టి; యా
రిపుజనకాలుఁ దోడుగ వరించెద సర్వము నిర్వహించెదన్.

పరిక్రమించి యెదుటఁ జూచి

మ. అదిగో! ద్వారక; యాలమంద లవిగో! నందంబుఁ గోరాడు; న
య్యదియే కోట; యదే యగర్త; యవె రథ్యల్; వారలేయాదవుల్;

యదుసింహుండు వసించుమేడ యదిగో! నాలానదంతావళా
భ్యుదయంబై వరమందురాంతరతురంగోచ్చండమై పర్వెడున్.
ప్రవేశము నటించి యాశ్చర్యముతో ఏమి! యీ విచిత్రము.

క. మనకన్న మున్ను దుర్యో
ధనుఁ డిట కరుదెంచెఁ గృష్ణుఁ దనవానిఁగఁ గ్ర
న్ననఁ జేసికొని చనన్ దన
మనమందుఁ దలంపఁబోలు మందుం డకటా!

వాసుదేవుండు పాండవపక్షపాతి! కాదు కాదు. ధర్మపక్షపాతి యనిన్సుంతైన నితఁ డెఱుఁగఁడు కాఁబోలు. నిరూపించి)

మ. అరవిందాక్షుఁడు శేషశాయి జగదేకారాధ్యుఁ డంభోధిజా
వరుఁ డార్తావనుఁ డంగజాంగజుఁడు శ్రీవత్సాంకుఁ డేమో! నిరం
తరనిర్నిద్రుఁడు నిద్రఁ జెందెడిఁ బవల్; తచ్ఛీర్షపుంబ్రక్క న
క్కురునాథుండదె కూరుచుండెఁ దళుకుల్ గుల్కంగఁ బీఠమ్మునన్.

(యథోక్తముగా శ్రీకృష్ణ దుర్యోధనులు ప్రవేశింతురు.
కృష్ణు:- కపటనిద్ర నటించుచుఁ దనలో

క. రాఁ డాయె నర్జునుఁడు, కురు
రాడవతంసంబు వచ్చె రమ్మని యనికిన్
దోడుగ నను గోరఁగ మో
మోడంగా వలసివచ్చు నొక్కింత యిటన్.

అర్జు:- భక్తితోఁ దనలో

మ. జలజాతాసన ముఖ్యదైవతశిరస్సంలగ్న కోటీర పం
క్తుల కెవ్వానిపదాబ్జపీఠి కడు నిగ్గుల్ గూర్చుఁ దత్సన్నిధి
స్థలిఁ గూర్చుండి భవంబు పావనముగా దైవాఱఁ గావించి నా
తొలిజన్మమునఁ గూడు పాపముల నాందోళింపఁగాఁ జేసెదన్.

కృష్ణుని పాదముల ప్రక్క నిల్చుంచును,

దుర్యో : అర్జునుఁ దేఱిపాఱఁ జూచి తనలో

ఉ. ఏ నిట కేగుఁదెంచుపని యేర్పడ సర్వము గుర్తెఱింగి రాఁ
గా నితఁ డోపుఁ గృష్ణునకుఁ గవ్వడి కేకశరీర మందు రీ
దానవపైరి వీనియెడఁ దా నవమానము చూపు టెట్లు? నా
పై నెనరూను టెట్లు? కడు బందుగుఁ డీతని ఠాతఁ డెమ్మెయిన్.

బంధుత్వమ్మున కేమి! కొద్ది గొప్ప నాకును నది లేకపోలేదు! లేకపోవుఁగాక నేను ముందుగాఁ దన్ను దర్శింపవచ్చితిని. దానిం బట్టి యీతఁడు నన్నవమానించినచో లోకులు "పక్షపాతి" యని తన్ను గర్హింతురని సందియ మందకపోఁడు. కానిమ్ము సకలమ్మును నిప్పుడే తేలగలదు.

కృష్ణు: తనతో

క. నాయనుఁగుంజెలి నాదగు
కాయము నాజీవగఱ్ఱ కవ్వడి వన్నన్
సాయమ్ము గోర వచ్చెన్
నాయంతస్తాప ముడిగె నను ముద మెనసెన్.

నిదురమత్తు నటించుచు నర్జునాభిముఖముగా లేచి కౌఁగిలించుకొని ప్రీతితో

ఉ. ఎక్కడనుండి రాక యిట? కెల్లరునున్ సుఖులే కదా? యశో
భాక్కులు నీదునన్నలును భవ్యమనస్కులు నీదుతమ్ములున్
జక్కఁగ నున్నవారె? భుజశాలి వృకోదరుఁ డగ్రజాజ్ఞకున్
దక్కక నిల్చి శాంతుగతిఁ దాను జరించునె తెల్పు మర్జునా ?
ప్రక్కకుఁ దిరిగి దుర్యోధనుం గాంచి గౌరవముతో

శా. బావా! యెప్పుడు వచ్చి తీవు? సుఖులే భ్రాత ల్సుతు ల్బృత్యముల్?
నీవాల్లభ మ్ముపట్టు కర్ణుఁడును మన్నీలున్ సుఖోపేతులే?
మీవంశోన్నతిఁ గోరుభీష్ముఁడును మీ మే ల్గోరుద్రోణాదిభూ
దేవుల్ క్షేమముమై వెలుంగుదురె? నీ శేముషి హెచ్చింపుచున్.

క. నీవచ్చినపనిఁ దెల్పి ము
దావహుఁడవు గమ్ము నాకు; నఖిలావనిపా
లావని మౌళిమణీసం
భావితచరణుఁడవు నీవు వచ్చుట యసదే.

దురో: తనలో ఇతఁ డర్జునుని సంభావించురీతి యొక విధముగను నన్ను గౌర వించు పైఖరి మఱియొక తెఱంగుగను గన్పట్టుచున్నది. కానిమ్ము లోకా చారము గాన నేను వచ్చిన పనిం దెల్పెదము. (ప్రకాశముగ) నేను వచ్చి చాలసేపైనది.

ఉ కౌరవపాండవుల్ పెనఁగుకాలము చేరువ యయ్యె; మాకు న
వ్వారికి గూడ నెక్కుడగు బంధుసముద్రుఁడ వీవు గాన, నీ
చేరిక మాకు నిర్వురకు సేమము గూర్చెడిదౌట, సాయమున్,
గోరఁగ నేగుదెంచితిమి గోపకులైక శిరోవిభూషణా!

క. ఇరువురకు సముఁడ వగుని
న్నరసితి నేఁ బ్రథమమునం దటుగానన్
సరసిజలోచన! నాకున్
గర మనుకూలుఁడవు గమ్ము కయ్యమ్మునెడన్.

కృష్ణు: కురుకంఠీరవా! నీవు చెప్పినది మిగుల యుక్తియుక్తముగా నున్నది. సర్వ విధముల మీకిరువురకు నేను సాయము చేయఁ దగు వాఁడనే. ఇఁక ముందు వెనుకలం గూర్చి విచారింపుదము.

ఉ. ముందుగ వచ్చి తీవు మునుముందుగ నర్జును నేను జూచితిన్
బందుగు లన్నయంశ మది పాయక నిల్చె సహాయ మిర్వురున్
జెందుట వాడి, మీకు నయి చేసెద సైన్యవిభాగ, మందు మీ
కుం దగుదానిఁ గైకొనుఁడు, కోరుట బాలుని కొప్పు మున్నుగన్.

దుర్యో: తనలో) ఇతఁ దేవో కుయుక్తి పన్నినను గొంత సాయము చేయక తీరి నది కాదు. కానిమ్ము నా కంతే చాలును.

ఉ. నాకు గదాగురుండు భువన స్తవనీయపరాక్రముండు సు
శ్లోకుఁ డమాయికుండు రిపులోకభయంకరుఁ డస్మదర్థసం
ధాకుశలుక డుదారగుణధాముఁడు శ్రీబలరామదేవుఁ డీ
ప్రోకలవాఁడు గాఁడు వృథ పృచ్ఛఁడు మెచ్చఁ డతండు పార్థులన్.

ప్రకాశముగా వాసుదేవా! నీ యిచ్చవచ్చినట్లే కానిమ్ము.

కృష్ణు. ధనంజయా! నీ యభిప్రాయమేమి?

అర్జు : సకలధర్మ స్వరూపుఁడ వగు నీకొరులు చెప్పవలసిన దేముండును ?

దుర్యో: నవ్వి) బావా! నీ యాపచ్ఛక్తిని బాటుపడి యర్జునున కిందు భాగము గల్పించుటయే కాక కోరుకొనుటలోఁ గూడ మొదట నతనికే యవకాశ మిచ్చియు "నీయభిప్రాయమే" మని యడుగుచున్నావు. ఇంతకంటె నెవరి యభిప్రాయమైన నట్లుండెడివి?

కృష్ణు: సుయోధనా! అట్లు కాదు.

క. నీవు స్వతంత్రుఁడ వీతఁడు
సేవకుఁ డగ్రజుని చెప్పుచేఁతలకున్ లో
నై వర్తించెడి, నందుల
కై వేఱుగ నడుగవలసె నది యట్లుండెన్.

ఇప్పుడీతని నడుగకయే మనకుఁ దోఁచినట్లు భాగము లేర్పఱచి కోరుకొమ్మన నేదో యొక విధమునఁ దనకుం బోలు తెఱంగునఁ గైకొని చనినమీఁద నయ్యది ధర్మజునికి నచ్చనియెడల "వాసుదేవుండు బందుగుఁ డయ్యును మమ్మును వంచించె"నని యన వచ్చును. అట్టి యెడ "మున్మాటికిని నీతమ్మునికిఁ జెప్పియే చేసితి"మని ప్రత్యుత్తర మిచ్చుట కవకాశ ముంచుకొనుటకై యిట్లు చేయవలసి వచ్చినది. ఇది యిట్లుండఁ గాక, ప్రకృతము విచారించుకొందము,

తే. గీ. అన్ని యెడలను నాకు దీసైనవారు
గోపకులు పదివేవు రకుంఠబలులు

గలరు నారాయణాఖ్యఁ జెన్నలరువారు;
వారలొకవైపు నే నొక్కవైపు మఱియు.

క. యుద్ధ మొనరింత్రు వార ల
బద్ధ మ్మెందులకు ? నేను బరమాప్తుఁడవై
యుద్ధమ్ము త్రోవఁ బోవక
బుద్ధికిఁ దోఁచిన సహాయమును బొనరింతున్.

దుర్యో : తనలో ఔరా! కృష్ణుఁ డెంత మోసము చేయుచున్నాఁడు? నేననంతయు నర్జునున కీయఁదలంచి యీ పన్నిక పన్నినాఁడు. ఎంత వెఱ్ఱివాఁడనై నను నిప్పట్లఁ దన్నుఁ గోరుకొనుదునా ?

క. ఆయుధము పట్టఁడఁట ! యని
సేయుండఁట ! "కంచిగరుడసేవ" యితనిచే
నేయుపకృతి యుద్ధార్థికి
నేయెడ నగు ! నిట్టివాని నెవ్వండు గొనున్.

యోజించి అయినను బరమాప్తుండగు శ్రీకృష్ణుని విడిచి యర్జునుం డితరము నపేక్షించునా ? తలపంకించి ఆపేక్షించనియెడలఁ గృష్ణుని కపటోపాయమెల్ల నాకే యుపయోగించుఁగాక !

అర్జు : బావా ! కోరికొనవచ్చునుగాదు ?

కృష్ణు : కోరికొనవచ్చును. నేను జెప్పినమాటలు తుట్టతుదవఱకు వింటివు కాదు ! ఇదిగో మరలఁ జెప్పుచున్నాఁడను.

ఉ. ఆయుధమున్ ధరింప నని కగ్గముగా నొకపట్ల నూరకే
సాయము సేయువాఁడఁ; బెలుచె న్ననుఁ బిమ్మట నెగ్గు లాడినన్
దోయిలి యొగ్గుదున్; నిజము తొల్త వచించితిఁ గోరికొమ్ము నీ
కేయది యిష్టమో; కడమ యీతనిపాలగుఁ బాండునందనా !

దుర్యో : తనలో క. ఇట్టి దొకటి లేకుండిన
దట్టుఁ డితఁడు "నట్టిగొడ్డుశాక" ప్పుడి

క్షట్టుంటఁ జేసి; నా కితఁ
డెట్టున్ దప్పండు నగుదు రెల్లరు నన్నున్.

అర్జు : ఇదిగో గోరుకొనుచున్నాఁడను.

ఉ. నందకుమార ! యుద్ధమున నారథమందు వసింపుమయ్య ! మ
ధ్యందినభానుమండలవిధంబున నీదగుకల్మిఁ జేసి నా
స్యందన మొప్పుఁ గాక ! రిపుసంతతి తేజము దప్పుఁ గాక ! నీ
వెందును నాయుధమ్మదరి కేగమి కొప్పుదుంగాక కేశవా !

దుర్యో : సంతోషముతోఁ దనలో సర్వవిధములఁ గృష్ణుని కపటోపాయము
మనకే యుపకరించినది.

తే. గీ. రథమునం దెన్ని చిత్రింపుఁ బ్రతిమ లుండ
నందు శివుఁడును విష్ణువు నజుఁడు నెల్ల
దేవతలు నుండవచ్చు ; నాకీవిఁ గృష్ణుఁ
డర్జున స్యందన విభూష యగునుగాక !

ప్రకాశము బావా ! పరిశేషన్యాయమునఁ దక్కినదానినే యేను గైకొంటివి.
ఇఁక నే నరుగుదునా ?

కృష్ణ : మంచిది పోయి రమ్ము.

దుర్యో : నిష్క్రమించును.

కృష్ణ : అర్జునుని వీపుపైఁ జఱచి చిఱునవ్వుతో బావా ! ధనంజయ !

ఉ. "అలయ సేయ నే" నని యథార్థము బల్కితిఁ జుమ్మి యిట్టి గో
పాలుని నన్నుఁ గోరితివి ! ఖండనపండితు లగ్నితేజు లు
త్తాలధనుర్ధరుల్ బహుశతప్రమితుల్ యదుసింహు లందఱిన్
బాలుగఁ గైకొనెన్ గురున్నపాలుఁడు బాలుఁడ వైతి వక్కటా !

అర్జు : ఆనందముతో బావా ! నీయుద్ధ మీరికిఁ గావలయు ? నీవు నా యెంట
నుండుటయే పదివేలు.

ఉ. "ఉన్నది పుష్టి మానవుల కో యదుభూషణ! యాలజాతికిన్
దిన్నది పుష్టి" నీ వరుగుదెంచి రథంబున నున్నఁ జూలు నే
నున్నముఁ జేసెదన్ రిపులఁ జూపఱు లద్భుత మందః సర్వలో
కోన్నత! నాకుఁ జే రౌనఁగు మూరకచూచుచునుండు మచ్యుతా!.

క. నీతూష్ణింభావము ప్ర
ఖ్యాతిన్ మా కొనంగుః నీవ యని చేసినచో
శీతాంశునెదుట రిక్కల
భాతిన్ బార్థులకుఁ బేరు బయ లెక్క నెటుల్ ?

క. పదివేలలెక్కయే మొక
పదికోటులు వీరు లున్న భరమా నీ కే
మెదురై తిమేని జయమున
నిదియెఱిఁగియె కోరితిని జుమీ నిను దేవా!

క. గోపాలుఁ డనినఁ దక్కవె
గోపాలుఁడవే నిజంబు గోపాలక! నీ
గోపాలకత్వ మొసఁగున్
గోపాలకతాభరంబు గొబ్బున మాకున్.

కృష్ణు : ప్రసన్న భావముతో ధనంజయా! నీకు నాయందుఁ గల భక్తికిం గడు సంతసించితిని.

ఉ. ఊరక చూచుచుండు మను టొప్పితిఁ గాని భవద్రథస్థుఁనన్
బాలఁగఁ జూచి నీరిపులు పక్కన నవ్వి యనాదరింతు రా
శూరకులంబు మెచ్చ రిపుసూదనతాభర మూనునీకు నే
సారథి నై యిఁకన్ విజయసారథినామమునన్ జరించెదన్.

అర్జు : పట్టరాని సంతోషముతో దేవా! లీలామానుషవిగ్రహా! నేను జిరకాలము నుండి యేది మనంబున నభిలషించితినో అయ్యదియే నీవు ప్రసాదించితివి.

క. బందుగుఁడ నీకు నోయదు
నందన! భక్తుండ నట్టి న న్నెటులైనన్
ముందఱకుఁ దెచ్చుభార మ
నం! దేవర దేవఁడు సుకృతి నాకన్న నిఁకన్.

పూర్ణముగా ననుగ్రహింపఁబడితిని.

ఉ. సారథి యంట! వేదములసారము శౌరి; తదంఘ్రిభక్తి చె
న్నారెడు క్రీడి తా రథికుఁ డౌనఁట! చిందము విల్లుఁ దేరునున్
వారువముల్ మొదల్ దివిజవర్గ మొసంగినవంట! యస్త్రవి
స్తారగురుల్ శివాదులఁట! సంగరమం దెవఁ డాఁగఁజాలెడిన్.

రావా! అన్న నీ రాకకై వేచియుండును గావున నుపప్లావ్యంబున కరుగుదము రమ్ము.

కృష్ణ: మంచిది పోవుదము. అర్జునా! మీ సుయోధనుఁ డిప్పు డెక్కడి కరిగెనో యెఱుఁగుదువా?

అర్జు: బలదేవుని సందర్శమున కని తలఁచెదను.

కృష్ణ: నీవనినట్లె! నీవు మాత్రము మాయన్నను సందర్శించి సహాయమేల కోరవు?

అర్జు: నామనంబునఁ గల యథార్థము వచించెద నాలింపుము.

ఉ. ఈ వొకరుండవే జగములెల్ల జయించెద, వేనుఁగూడ న
ట్లే విలయం బొనర్పఁగల, నెందును పేర్గలవాఁడ వౌట నీ
కీ విజయ ప్రశస్తి యగు నేమొ యటంచు మదిన్ దపింతు స
ద్భావముకల్మి నా యభిమతం బొడఁగూర్చితి, కొండ నెక్కితిన్.

మ. బలరాముండు బలాభిరాముఁడతనిన్ బ్రార్థించినన్ వచ్చుఁ బో
కలన న్నీవలె నుండు టొప్పఁడతఁ డక్కంఠీరవం బెల్ల యో
ధులఁ జక్కాడు మృగావళిన్ బలె, యశోదుగ్ధాబ్ధి నింకొక్కఁ బ్రో
ల్వేలయించున్ దనపేర, నాకు జగతిన్ బే రెట్లు పెంపారెడిన్!.

కృష్ణ: నవ్వి ధనంజయా! అతఁడు మన కెదుటి పక్షమున నిల్చినచో నప్పుడు మాత్రము సంగరంబు భారము కాదా ?

అర్జు : అగుఁగాక! నీ యనుగ్రహ మున్నచో నేలోపమును రాదు.

కృష్ణు : (నవ్వి) నీ ధైర్యమునకు సంతసించితిని. ఇఁక నిజము వచించెద వినుము.

ఉ. వచ్చెడివాఁడు గాఁ డతఁడు వారికి మీకును గూడఁ, దోడు, వి
వ్వచ్చుండ! యమ్మహామహుని భావము మున్నె యెఱింగినాఁడ, నా
సచ్చరితుండు మీకుఁ దగ సంధి. ఘొనంగిన సంతసించు, నా
యిచ్ఛయు నట్టిదే! మననరేంద్రుని యిచ్ఛయుఁ గూడ నిట్టిదే.

కావున మన మిఁక నిందులకై యత్నింతము రమ్ము.

నిష్క్రమింతురు

గద్య.

ఇతి శ్రీ....తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁబడిన పాండవోద్యోగమునందు ప్రథమాంకము.

శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవోద్యోగము

## నాటకము

## ద్వితీయాంకము.

(ప్రిదపఁ బాండవు లైదుగురును ద్రౌపదియుఁ గృష్ణుఁడును ప్రవేశించుచున్నారు!

కృష్ణ : దేవా! అజాతశత్రూ! యుధిష్ఠిర!

క. నాతరము కాక యున్నను
జేతులు జోడించి కొనుచుఁ జేసెద దాని
న్నీతలఁపు దెలుపు మఖిలధ
రాతలపతిమౌళిరత్నరంజిత చరణా!

ధర్మ : దేవా! వసుదేవనందన! నీ యొనర్చు సంబోధనము ధార్తరాష్ట్రనసూచకమే మో
గాని వానప్రస్థుఁడ నగు నే నిప్పటి కందులకుఁదగుదు.

ఉ, "తమ్ముని బిడ్డ లంచు మదిఁ దల్పఁడు పుత్రులతోనఁ గూడె రా
జ్యమ్మున మీకుఁ బాలొసఁగఁ డంధనృపాలుఁ" డటంచు మొన్న నీ
సమ్ముఖమందు తేల్చెఁగద! సంజయుఁ డాకురురాజు లబ్ధిచి
త్తమ్మునఁ గన్నుఁగానఁ డిఁకఁ దప్పదు యుద్ధము బంధునాశమున్

3 )

జయపరాజయంబులు దైవాధీనంబు లనియు నాదైవంబ వగు నీవు మాయెడఁ గలవనియు నెఱుఁగుదును. అయినను,

ఉ. అలుసు బిడ్డ లేద్వ నృపు లాలములోఁ గడతేఱ కెల్లచు
ట్టాలుసు రూపుమాయ కకటా! యిల దక్కనె! దక్కనిత్తురే?
చాలును రాజ్యభాగము; ప్రజల్ సుఖియించిన నాకుఁ జాలు; నేఁ
జాలక కాదు చూవె! తినఁజాలను నెత్తురుకూడు మాధవా!

కృష్ణు: బావా! యీయసమయనిర్వేద మేల? క్షత్రియకుమారులకు నెత్తురుకూడు గా జోలికూడు తినుట ధర్మమా? అయినను నీయభిమతం బేదియో నిర్వర్తించుటయే మాకుఁ బరమధర్మము కావున స్పష్టముగఁ దెలుపుము.

ద్రౌప: తెలుప వలసిన దేమున్నది? మొన్న సంజయుఁడు "నీకు వారు యుద్ధము చేయనిచో రాజ్య మీయరనియు నీవు యుద్ధముచేసి రాజ్యము కోరుటకన్న నంధకరాజ్యమందో వృష్ణిరాజ్యమందో బిచ్చమెత్తుకొని జీవించుట కొంత యుక్తమనియు బోధించెను గదా! అట్లు బిచ్చమెత్తుకొనుచు మధ్య మధ్య వనంబులకరిగి వెనుకటివలెనే కందమూలంబు లారగించుచు ఋషులతో ధర్మశాస్త్రంబులు ముచ్చటించుకొనుచు నుండవలసినదనియే మీ బావగారి యభిప్రాయము.

కృష్ణు: అమ్మా! ద్రుపదరాజపుత్రీ! చెప్పవలసినదంతయుఁ జెప్పనిమ్ము (యుధిష్ఠిరుదిక్కు— దేవా! యుధిష్ఠిరమహారాజ!

చ. సంజయురాయబారమున సార మెఱింగితి మాతఁ డెందు మీ
కుంజను శాంతి, వారలకుఁ గోపము యొప్పెడి; మీకు బిచ్చపున్
గంజి రుచించు, వారలకుఁ గమ్మనిపాలు రుచించు; మీకు నై
వింజము పుట్టె, వారికయి పృథ్వి జనించె నటంచుఁ దెల్పెడిన్.

ఔరా! యేమి యీశుష్కప్రియములును శూన్యహస్తములును!

క. మా కాయుష్యము మఱియున్
మా కారోగ్యంబు మఱియు మాకు ధనంబున్
మీకు ఋణ మన్న తెఱఁగున
కీ కౌరవనాథునంధి దృష్టాంత మగున్.

క. పా లీకున్నను దమకం
దా లోఁబడి తినుటకేని దయసేయుఁడ భూ
పాలుఁడు ధృతరాష్ట్రుండు స
చ్ఛీలుం డాతనికి నెవరు చెప్పెడివారల్.

ఈ సంధి సర్వవిధముల "నీకంట నేను ప్రేలిదెదను నానోట నీవు ప్రేలిడు" మన్నటులున్నది. ఇది యిటులున్నను నీమనంబు యుద్ధమునకు వెనుదీయు చున్నది. అగుఁగాక నీ నిశ్చయము వ్యక్తీకరింపుము.

ధర్మ : నీ నుడివిన దంతయు నిక్కమే; అయినను పితామహకుంభ సంభవకృపా చార్యప్రముఖులు వినుచుండఁ బేరోలగమునఁ బుత్రశతపరివృతుఁడగు మా పెదతండ్రితోడ నీవుఁగూడ నొక్కసారి సంధివచనంబులు విన్నవించిన విను నేమో యని తలఁచెదను.

ఉ. ఇంతకు సంధిమాట వినని వినకుండఁగని మనంబు ని
శ్చింత మగున్, జనంబు మన సేమమె కోరుదు రెల్లవారు, నిం
దింతురు వారి నిశ్చయము, నిన్ను నుతింతురు, మాకుఁ గీర్తి; సా
మంతనృపాలు రందఱకు మావ్యవసాయము తేటతెల్లమౌ
కాన మ ఋష్మియాపత్సముద్రము దాఁటింపఁ గర్ణధారుఁడవు కమ్ము.

ఉ. సంధి యొనర్చి మాభరతసంతతి నిల్పుము లేద యేని గ
ర్వాంధుల ధార్తరాష్ట్రుల సహాయులతోఁ దునిపింపు మో జగ
ద్బాంధవ! రెండు కర్జములభారముఁ బెట్టితి మయ్య! నీభుజ
స్కంధమునందుఁ; దాతసిలుఁగావుత మాకు యశంబొ, రాజ్యమో

సకలధర్మస్వరూపుఁడవును సమస్తశాస్త్రవిశారదుఁడవు నగునీకు మా యుప దేశం బనావశ్యకము. అయిన నొక్క విశేషంబు వినుము.

గీ. సౌబలేయులు సంధి కిష్టపడి రేని
అన్నదమ్ముల మేము నూట్రైదుగురము
పాడిమెయి నిష్టపడరేని వారు నూఱు
గురె సహోదరు; లే మైదుగురమె కృష్ణ!

కృష్ణ: అట్లుజరుగుటయే దుర్లభము గాని జరిగిన మంచిదియే కదా.

ఉ. మీరును మీరుఁ గీడ్వదుట మేలగు నే బ్రజకైనఁ గాని దు
ర్వారులు ధార్తరాష్ట్రులు భవాదృశు లౌదురె ధర్మరాజ? నీ
కూరిమి నోరిమిన్ బ్రజలకు న్హితం బొనరింతు నచ్చటన్.

ధర్మ: ఆలోచించి పాపాత్ములగు సుయోధనాదులకడకు నిన్ను వంటివారిం బనుచుట యపాయకరం బనియుఁ దలఁచెదను. త్రిలోకాధిపత్యంబేనియుఁ బాండవులకు నీసేమమువంటిది గాదు గదా!

కృష్ణ: (నవ్వుచు బావా! అట్లైన్నఁడును సందేహింపకుము.

క. ఉక్కివు అగుకౌరవులుం
దక్కిన ఘావరులుఁ గలిగినను బార్థివ! నా
ప్రక్కకు రానేర్తురె! యొక
లెక్కయె నిక్కముగ నే నలిగినం జెపుమా?

గీ. న్యాయమార్గంబు వినవికర్ణ త్రయంబు
గలుగువాఁడు గదా! యట్టిఖలునియెడల
సంధి కుదురునె యను నొక్కసందియంబె
కాని మనమున నా కొండు గలదె వెఱపు!

ధర్మ: నీ కొక్కరివలన వెఱపు లేదనుట సత్యమే. అయినను,

ఉ. దౌత్యముపట్ల నీదు దెసఁ దప్పుపనుల్ పచరించు కౌరవ
వ్రాత్యుల రూపు మాపుపని పట్టినఁ బట్టఁగవచ్చుఁ గాన మీ
సాత్యకి వెంటఁబెట్టుకొని చ న్మచటన్ గృతవర్మ కౌరవా
మాత్యుఁడెయయ్యుయాదవుఁడు మాధవ ! నీకనుకూలుఁడయ్యెడున్.

భీము : కనులెఱ్ఱఁజేయుచు ఇంతకు సంధి యేమని?

ద్రౌ : ఏకసక్కెముగా ఐమూళ్ళిచ్చినఁ జాలు నని యఁట!

భీము : తనలో ఆహా! కాలవైపరీత్యము,

చ. అనుపమవిక్రమక్రమసహాయుల కంతటి పాండురాజనం
దనులకు నొక్కకూళ్ళ భరణం బిడుచూడ్పున నూళ్ళైదు ని
చ్చునఁట! కటా!యటు ల్బ్రదుకఁ జూచుట రాచకొలంబువారికిన్
ఘనతయె? మంత్రరుద్ధభుజగంబ నిసీ! యిపు దేమిచేయుదున్.

దుర్యోధనాదుల నెదుట నున్న వారివలె భావించుకొనుచుఁ బ్రకాశము ఓరీ ! దుర్యోధన దుశ్శాసనహతకులార !

ఉ. అగ్రజుఁ డంపుగార! నరకాసురమారకుఁ డేగుఁగాక! మీ
రుగ్రత మాని సంధి పడ నుందురుగాక! యిదంభజార్గళో
దగ్రగదాప్రహారములఁ దప్పదు మృత్యువు మీకు నమ్ముఁడీ
యగ్రజు సంధికి న్నృపతు లందఱిపావమియే ఫలం బగున్.

ద్రౌప: ఏమీ ! దుర్మార్గులగు కౌరవు లెదుటనుండి తలపట్టి యీడ్చి కట్టుపుట్టంబు లొలువఁ జూచుచుండియు నన్ను దిక్కుమాలినదానిఁగాఁ జేసిన పార్థమధ్యమున కీయసమయకోపము ! ఔను ! అసమర్థుల కెంచును బరోక్షమునందె ప్రగల్భోక్తులు మెండు.

భీము : ఎదుటఁజూచి ఏమీ యిచ్చట వారు లేరా ? కోపాంధకారమునఁ గానక యిట్లంటిని. ద్రుపదరాజపుత్రీ! నిజము. అసమర్థులమే ! కాదేని,

మ. ఒక దుర్మార్గుఁడు కొప్పు పట్టికొని సర్వోర్వీపతు ల్చూడఁ గొం
కక నీకట్టినపుట్ట మార్యసభ లాగం జూడమే ! దాని కూ
రకయున్నట్టికంబ యస్మదసమర్థత్వంబు వా క్రువ్వఁగా
సకి! యిం కేటికి మమ్ము దూఱెదవు వాచాశూరు లిప్పాండవుల్.

ధర్మ : క్షత్రియదంపతులారా! శాంతింపుఁడు శాంతింపుఁడు! భవితవ్య మెన్నఁడును గాకపోదు.

భీము : శాంతించి చిరకాల మైనది. గద నేలంబడవై చుచున్నాడు.

కృష్ణు : అర్య ! ధర్మతనూజ ! సంజయునిమాటలు వింటిని. నీ నిశ్చయంబును వ్యక్తపఱచితివి. ఇంకఁ బయనమై హస్తినాపురంబునకుంబోయి నీయభిమతం బీడేర్పఁ బ్రయత్నించెదను. కాని—

గీ. మోఱకులు కౌరవులు నీతిదూరు లనుచుఁ
జెలిమి ఘటియిల్లుటయు ననిశ్చేయ మనుచుఁ
దెలిసి యుండియు నీ బుద్ధి కలఁత వడియె
బురదలోఁ బడ్డయేనుఁగుఁ బోలె నధిప!.

ఉ. మాయదురోదరంబున నమాయికుని న్నిను గెల్చి కాంతకుం
జేయఁగరానియంతపనిఁ జేసి యరణ్యములోని కంపియున్
హాయిగ నుండనీక ఖలులై పలునెగ్గులు పన్నుచున్న యా
దాయలు చత్తు రంచు దయఁ దాల్చెద వెంతటి ధర్మరాజవో?

విక్రమరహితు లగురాజుల కాపదలు మెండనియు నిడుములుపడువాని కదృష్టము దూరమనియు నదృష్టహీనునకు భాగ్యంబు చేకూరదనియు వచించుపెద్దల నీతివాక్యములు స్మృతికిం దెచ్చుకొనుము.

గీ. శత్రుపక్షంబు నిరసించి సంగరంబు
సేయ మదిఁ జొన్పు మయ్య! నిశ్చింత మీఱ
నేనుఁగుల్పాఁ జంపి జీవింపఁబూనుఁ గాని
నీరసంపద దెపుడు కంఠీరవంబు.

గీ. మానహానికి సమ్మతింపరు మహాత్మ
అనువు లైనను విడుచుట కనుమతింత్రు
బూదె ముంగాలఁ దన్నుచుఁ బోవుఁ గాని
మంటదరి కేగఁ జూచునే మనుజగణము ??

ధర్మ : శాత్రవులు మిగుల బలసంపన్నులు. మనమా! యంతటిబల సహాయము లేనివారము. జయం బెవరికో మనకో తెలియుట దుర్లభము; దానంజేసి సుఖము వైకల్పితము. అది తలఁచి నిశ్చితసుఖంబగు సంధి సేయుటయే మనకుఁ గర్జంబు.

కృష్ణ : యుధిష్ఠిరా! నీ బలపరాక్రమములును నీ తమ్ముల తేజంబును నీ వెఱుఁగక మాటలాడుచున్నావు.

ఉ. నాల్గుపయోధులో యనఁగ నాలుగుదిక్కరులో యనంగ నీ
నల్గురుతమ్ములుం బ్రమథనాథసమానులు; యుద్ధరంగమం
దల్గిన నెవ్వఁ డోపఁగలఁ డయ్య! భవత్పరిభావవహ్నికిం
గల్గిన వృద్ధి యింత రిపుకాంతల బాష్పము లార్పఁ జూడుమా!!

ఇదియు భవితవ్యమునకుం దగిన యుపదేశము గాని నీ తలంపున కన్యథాకరణంబు కాదు.

ఉ. ఐనను బోయి రావలయు హస్తిన; కచ్చటి సంధిమాట యె
ట్లైనను శత్రురాజుల బలాబలసంపద చూడవచ్చు నీ
మానసమందుఁ గల్గు ననుమానముఁ దీర్పఁగవచ్చుఁ దత్సమా
ధానము మీవిధానమును తాతయు నొజ్జయు విందు రెల్లరున్.

భీమ : (విగ్గరగా) ఓయీ! కురుపాండవసంధివిధానధౌరేయ! పాండవ దూతా! జనార్దనా! మా రాజుగారి తలఁపు వేఱు నీతలఁపు వేఱుగనున్నది.

ఉ. యుద్ధము యుద్ధ మంచు మది యుబ్బఁగనీకుము మానివై యసం
బద్ధము లైనవాక్యములు పల్కకు మం దెవ రెట్టు లాడినన్

గ్రుద్ధుఁడ వౌచు సంధిఁ జెడఁగొట్టక ధర్మతనూజకార్యసం
పిద్ధి యొనర్చు మయ్యనఘుసేమమె మాకును సేమ మన్నిటన్.

ప్రకృతిదుర్లలితుండును నా జన్మపాండవద్వేషియు నైశ్వర్యమదమత్తుండును క్రూరపరాక్రముండును దురుద్యోగియు మానియు నగు సుయోధనుండు చచ్చుటకైనఁ దెగుఁ గాని తనమతంబు వదలఁడు. వానినైజంబు నీ వెఱుంగనిది కాదు.

గీ. ఒక్కొకకులంబు నశియింప నొక్కఁడొకఁడు
పుట్టు వొందిరి పూర్వ మపూర్వనృపులు
ఖలులు నేఁటికి గాంధారికడుపునందు
జనన మందిరి భరతవంశంబుఁ గాల్ప.

కానఁ జతురుపాయంబునఁ గాక తక్కిన చతురోపాయంబుల వానిఁ జక్కఁ బఱపుము.

కృష్ణ : నవ్వి) ఇవి భీమసేనుని మాటలేనా! సమీపించి చేతితోఁ జఱచుచు

గీ. నిదుర వోచుంటివో! లేక బెదరి పల్కు
చుంటివో? కాక నీవు తొల్లింటి భీమ
సేనుఁడవె కావా! యెన్నఁ డీచెవులు వినని
కనులు చూడని శాంతంబు గానవచ్చె.

చ. "కురుపతిపెంపొడ ల్వీఱుగఁ గొట్టెద తొమ్మ పగిల్చి వెచ్చనె
త్తురు కడుపారఁ గ్రోలి యనిఁ దున్మెద దుష్టుని దుస్ససేను భీ
కరగదచేత" నంచును బ్రగల్భము లాడితి వల్ల కొల్వులో
మరల నిదేల యీపిఱికిమానిపల్కులు మృష్టభోజనా!.

ద్రౌప : భగినీవత్సలా! నూఱుమాట లాడవచ్చును గాని యొకమాట నెఱవేర్చుట దుర్లభము కదా!

కృష్ణ : ఔను! మానవతీ శిరోమణీ!

గీ. బరువుమోయఁగ లేని దుర్బలుఁడు సమయ
మరసి యేకాంతమగుచోటి కరుగుపగిది
నేఁటిదాఁకఁ బ్రగల్భపుమాటలాడి
బెదరుచున్నాఁడు పోరికై భీముఁ డిపుడు.

ధర్మ : తనలో ఎట్లెట్లో చల్లాఱిన భీమకోపాగ్ని నీ మహానుభావుండె రగులు కొల్పుచున్నాఁడు కాన నిటు చేయఁ గూడదని మందలించెదను. (జనాంతికముగా వాసుదేవా! మహానుభావా !

చ. పగ దిగవాడి నావలభక్తి కతంబునఁ గాళ్ళసంకెలల్
దగులుప లోపల న్వగచుదంతివిధంబున నున్నవానితో
జగడము తెచ్చిపెట్టుకొని శౌర్యముఁ బోరికి నాయుతంబు సే
యఁగ నిఁక నున్నదే ! మన ప్రయత్నము లన్నియు సాగనేర్చునే ?

కృష్ణు : ఈ భీమునకుఁ గోప మలంకారమగుననట్లు శాంతము కానేరదు కావునం గోపమువచ్చుటకయి యీ ప్రశంస తెచ్చితిని గాని యథార్థముగాదు.

ద్రౌప : జనాంతికముగా అన్నా ! దీనశరణ్యా ! పాంచాలి పరిభవ క్లేశ మనుభవించుటకుం బాలుపంచుకొనునార్యవృకోదరుని కోపాగ్నియే చల్లాఱిన ద్రౌపది యిఁక దిక్కుమాలినదే సుమీ.

భీము : ఎకసక్కెముగా) ఓయీ ! కురుపాండవ సంధివిధానధౌరేయ ! పాండవ దూతా ! యదునందనా ! ఏమంటివి ! "బెదురుచున్నాఁడు పోరికై భీముఁ డిపుడు" అనియా ! అవును పుట్టుపుచేతనే శూరకులభూషణుండగు నీవు నన్ననవలసినదే.

ఉ పసితనమంద పాలొసంగ వచ్చిననాతినిఁ జంపినాఁడనో !
పసరముతోడఁ బోరి బలవంతులలోపలఁ గీర్తి గొంటినో !
ముసలిది మేని చీలికలు మూసిన?మాసిసి కోటిపోతినో !
మసలితినో ! సదా వసులమాటున శౌర్యము నాకుఁ గల్గునే

కృష్ణు: తనలో ఇదిగో! భీమమనశ్చతుష్పథంబునం గ్రోధన్యక్రోధంబు మోసు లెత్తుచున్నది. సమయానుకూల వచన రచనా దోహదంబున నప్రతిహతమై దెస లాక్రమించునట్లు కావించెద. ప్రకాశము బావా! భీమసేన! ఉన్న మాటన్న నీకింత యలుకేల? వీరము లాడియాడి సమయమునకు సంధికిం బురికొల్పుచు గద దూరముగాఁ బాఱవైచి కూర్చుంటివి కాన నట్లంటి.

భీము : ఓయీ! పరాభి ప్రాయానభిజ్ఞా! యుద్ధమునకే బెదరితినో! యన్నగారి యాన తికే బెదరితినో తెలిసికొనలేకపోతివి.

ఉ. అంబుధు లింకుఁగాక ప్రళయాంతము వచ్చిన వచ్చుఁగాక లో
కంబులు సూర్యచంద్రు లడఁగం దలక్రిం దగుఁగాక గొప్పక
ష్టంబులు మూఁడుఁగాక పెనుసంపద పెంపఱుఁ గాక యెట్టి కృ
త్యంబుల నెందునే నడుగుదాఁటరు పాండవు లన్నమాటకున్.

కృష్ణు: బావా! సుయోధనుని తొడలు విఱుగఁ గొట్టి చంపెద ననియు దుస్ససేనుని రొమ్ముఁజీల్చి నెత్తురు ద్రాగెద ననియు నీవన్నమాటలు గావా!

భీము : బింకముతో అవును నేనన్న మాటలే.

కృష్ణు: చిఱునవ్వుతో ఐనచో భీముఁడు దక్క దక్కిన పాండవులే యన్నమాట కడుగు దాఁటనివారు.

భీము : ఎక్క సక్కెముగ ఓయీ! అన్నమాట కనగా నీకర్థమే తెలియక పోయె.

గీ. గొల్లఖిల్లాంద్ర వంచించి కొంపకొంప
కరిగి పాల్వెన్న పెరుఁగు దొంగతికమునన
బొట్టనిండించి జీవించినట్టి వెఱ్ఱి
గొల్లనికి నీకు విద్యలగోల యేల,

గీ. ధర్మతనయుండు నడపినదారిఁగాక
మాయుత్రోవను జనుట మామతము కాదు
లేకయుండిన ద్రౌపది శోక మార్ప
నీవు దిక్కైతి వన్న గోదేల మాకు.

అర్జు : (తనలో హాస్యవ్యాపారము మర్యాదలను గూడ నతిక్రమించుచున్నదే. ప్రకాశముగా ఆర్యా! భీమసేన! నేనును సుయోధనుండును రణసాహాయ్యంబుగోరి యేక కాలంబునం బ్రార్థించినను గొంతొక నెపంబుఁ గల్పించి మనయందలి పక్షపాతముచేత మనకు బాసటగా వచ్చిన యీ మహానుబావు నిన్ దురుక్తులాడి విరక్తునిం జేయుచున్నావు. అతని గోదే మనకు సర్వదా కావలసినది.

మ. చెలి చుట్టంబు మహానుభావుఁడు కృపాసింధుండు మాన్యుండు గా
క, లఘుత్వంపుఁ బ్రశంసకుం దగునె? నీకార్యంబు సాధించుకోఁ
గల నైపుణ్యము నీవెఱుంగ వనునే కాకట్లు మెనత్తపు
త్రుల మంచించుక మేల మాడఁదగదే? రోసంబు రాఁబాడిమే ?

భీము : అర్జునా! నీకు దెలియదు. మేలమాడుటకు దేశకాల పాత్రంబులు లేవా ?

మ. బకునిం జంపితి యాపు మాపితి హిడింబాసోదరున్; దుష్టకీ
చకులం దున్మితి మున్న నూర్గురఁ; జరాసంధున్ దురాసంధు నే
నొకడం జంపితి నాకు భీమునకు వేఱొక్కండు తోడేల! యె
న్నక నన్నిగతిఁ బోరికిం బెదరు చున్నాఁడం చనం బాడియే?

ఉ. పుట్టినదాది పేరయినపోటుతనం బొకయింత లేక రా
పట్టితనంబుజాడఁ గనుపట్టగ నీయక ప్రేమెలందుఱం
జెట్టకుఁ జేరఁ దీసి వలుచెట్టలు చేసిన యొక్క గొల్లరా
చుట్ట మెఱుంగునే? భువనభూరు సమీరకుమారుఁదీకమున్.

నకు : తనలో అన్నగా రేలొకో మన్ననకుం దగినవెన్నునిపై నెన్నఁదును లేని

చిన్నతనంబుఁ జూపించుచున్నారు. ప్రకాశముగా ఆర్యా! జరుగఁబోవునదే యొకటియు జరుగుచున్నది మఱొకటియు నగుచున్నది.

క. జనకుఁ డగు పాండుభూపతి
చనినప్పటినుండి యేదొ సంగులు రాకుం
డ నిరత మీయన గానే
మనలను గాపాడుచున్న మానిసి తలఁపన్.

అట్టివాఁ డొక్కమాట యేకసక్కెమునకై యాడిన సహింపరాదా? కాక,

ఉ. గొల్లఁడు గొల్లఁ డంచు వినఁగూడనిపల్కుల నిట్లు దూఱఁగాఁ
జెల్లునె యీపరాత్పరుని చెయ్వు లెఱింగియకాదె యన్నయుం
దల్లియు నెప్పుడున్ గురుపదంబుగ నెంతురు దానినైన నీ
యుల్లములోపలం దలఁప వుత్తయమాయికకోపి పక్కటా!.

భీము . తమ్ముఁడా! మద్రభూపాల [illegible] దౌహిత్ర! [illegible] యీ [illegible] వాక్యములు.
మీరంద ఱతని యడుగులకు మడుగు లొత్తిన నొత్తుదురు గాక.

గీ. చావకుండ నితఁడె సంరక్షణముఁ జేసె
నొక్కొ? యక్కతోడ లక్కయింటఁ
గూడఁ దోడువేదమై డాసె నీతఁడే
యిడుమ లడవులందుఁ గుడుచునపుడు.

సహ : ఆర్య! కనిష్ఠసోదరా! ఏల యీ యప్రస్తుత ప్రశంస! మున్నెన్నఁడును మన కుపకారము చేయక నే [illegible]మ్చును. ప్రస్తుతమున,

ఉ. సాయము చేయ వచ్చెఁ గద! శౌరి, యతం డొక [illegible] మాడ న
న్యాయముగాఁ గుటుంబకలహంబునకుం దెగితీవు బాలు!

కోయతనంబు బైటఁబడె గోడలకుం జెవు లుండు నయ్యయో!
దాయలు విన్న లోకువగదా! యని యైనను మిన్నకుండరే.

అదియునుంగాక యథార్థ మాలోచించినను-

ఉ. తాతయు నొజ్జయున్ గురులుఁ దక్కినజోదులు చూచుచుండఁగాఁ
బాతకు లీడఁబోక మనభార్యను బట్టి పరాభవింప నా
నాతికి మానరక్షణ మొనర్చినయట్టి మహోపకారి ని
న్నీతఁడు శౌర్యహీనుఁడని యీరసమాడిన లోప మున్నదే.

భీము : ఛీ! ఛీ! కుఱ్ఱవానిచేతఁ గూడ నింతలేసి మాట లనిపించుకొనుచున్న యీ దురభిమానపు బ్రతుకేల? ఇదిగో! ఈగదాదండమునం దల వ్రయ్యలు చేసికొని యెద. గద పుచ్చుకొని ఓ గదా చండమా !

చ. వెలఁదినిఁ గొల్వులోఁ బరిభవింపఁగఁ జూచుచు నున్నకూళ చే
తుల నినుఁ దాల్చి నిక్కముగ దుర్యశముం గొనితెచ్చె నీకుఁ ద
త్ఫలముగ నేఁడు వానితల వ్రయ్యలుచేసి యశమ్ముఁ గొమ్ము నీ
తలఁపగు వీరపుంగవుని తావునకుం జని నీకు మ్రొక్కెదన్.

ద్రౌప . భీముని చేయి పట్టుకొని ఆర్యపుత్రా! శాంతింపుము శాంతింపుము. పగఱ గెల్చుటయు లేక చచ్చుటయు నాఁడు చేయందగినవి కాని నేఁ డీవృథా ప్రాణత్యాగ మేల? "హాస్యంబునకు వేళకాల పాత్రంబులు లేవా !" యని మీరుగ్గడించిన పలుకు మిగుల లెన్స పలుకు; పాత్ర మెఱుంగక మేలమాడిన యీ తప్పు శౌరిది కాని మీయదికాదు. నాథా! యీదీనురాలి నేమిచేసెదరు ? నాపరాభ వానలం బార్పువా రెవరు? నే నిఁకముం దనాథ నగుదునా! ముత్తైయిదువ నగుదునా? చాల రేని మీయైదుగు రేకవాక్యంబున నక్కౌరు కుల పాంసనులం జంపి యంగుటంబు మొదలొదలవలకు బగ్గుబగ్గున మండు యపరాభవానలంబుఁ జల్లార్పుఁడు లేదేని రణరంగంబు నందైన

వీరస్వర్గ మనుభవింపుఁడు; ఈ యెక్కటి దుర్మరణంబు వలని ప్రయోజన
బేమి? ఓదేవా ! అజాతశత్రూ ! మున్నరణ్యం బునఁ జెలియలివావియైన
దలంపక నన్నుంజెఱఁగొన్న సైంధవునిం గ- తెప్పించినగతి నీనుయోఁ
నాథులం గట్టి తెప్పించుటకునైన నీతమ్మునకు సెలవిమ్ము.

భీము : పాంచాలీ! నన్ను వారింపకుము.

ఉ. ఎమ్మెయినైన యుద్ధమున కియ్యకొనండు యుధిష్ఠిరుండు, మ
ర్మమ్ములు దూఱనాడుచుఁ "బరాభవమో" యనియేడ్తు వీవు; క
ష్టమ్ముగ నీగతిం బ్రతుకుకంటె సుఖం బగుఁ గాక మీఁద దుః
ఖమ్ము ఁగాక చచ్చుటయె ర్జము మాని మానినీమణీ !

ధర్మ: భీమునిసమీపించి నాయనా ! భీమసేనకుమార! నీవేల యీ యాత్మహత్య
కొడంబడెదవు ! ఓవాసుదేవా ! గోరులతోఁ నుమఁదగివది గొడ్డలితోఁ
దునుముచ చేసితి గదా ! ఓ- -ంచాల కోపానలంబుఁ
బ్రజ్వలింపంజేయఁ గట్టెలు -చి -ట్టినట్లె మ -ంటివి గదా !
ఓ సహదేవకుమార! ఒడలు -చ్చిన నన్నేఁడును నోరులఁ -న్నమె మాట
యననివాఁడవు గురువులదెసనా యపచారము?

ఉ. జూదరియై కళత్రమును శోకముపాలొనరించి తల్లి దా
యాదులయింట నుండఁగ మహాటవిపాలయి తమ్ముగుఱ్ఱలం
గాదలిపెండ్లమున్ వెతలఁ గ్రాఁచిన యీబరి యుండ మాని యిం
దేదియు లేనిభీముపయి కేగెద వేల గదాప్రహారమా !.

కృ - తనలో వ్యవహారము ముదురుచున ది కావున మరల భీమసేను నెప్పటి
యట్ల కావింపవలయు. జనాంతికముగా ధర్మతనూభవా! ఏమది నీకుఁగూడ
నీవెఱ్ఱి! ఊరక చూచుచుం -, ఇంతలో వాయునందనునిం బనన్నునిం
జేసెద. !- -శముగా బావా! మ న భేద మెఱుంగని మీపెద్దన్నగారి

మదికిఁగూడ ఖేదము గల్పించితివి. నీవే యిట్లు సాహసించితివేని—

ఉ. భీకరమై యగాధ మయి భీష్మగురుప్రముఖోపలాకులం
బౌ కురురాట్చమూజలధి కడ్డముగాఁ జనఁగా భవచ్చమూ
నౌకను ద్రిప్పఁగాఁ దగిన నావికుఁ డెవ్వఁడు! నీవు లేక యీ
శోకము తీరునే ద్రుపదసూతికి నిక్కము వాయునందనా!

గీ. అన్నమాట లాలించి నీ వన్నమాట
లబ్బురము దోఁపఁజేయ నే నట్టు లంటిఁ
గాని యెవ్వరు నీపరాక్రమ మెఱుఁగరు
సమయ మిదె వచ్చుచున్నది శౌర్యమునకు

అదియునుంగాక చిన్నతనంబునుండి దురాత్ములగు సుయోధనాదుల చెడు తలంపులకు నీవ తగియుంటివి.

ఉ. త్రాటం గట్టిరి నీటఁ ద్రోసిరి విషద్రావంబుఁ ద్రాగించి రా
రాటంబుం బడి "రీవు గీర్వడినఁ బోరాటం బకించిత్కరం
బాటంకం బనబో" నటందుఁగద; యహా! యట్టి తత్త్వ మె
ప్పాటం దోఁగితో! యెట్లు సంధి యొనరింప న్నన్నుఁ బ్రేరేచితో?.

: కోపము చాలించి కృ -! మాటిమాటికి నాచేత నేల ప్రేలించెదవు.

ఉ. ఇంతిని గొప్పుఁబ [illegible] కాని యీడ్వఁగఁ జూచితి నెందుచేతనో
వంత దురంత మైనవనవాసముఁ సితి . [illegible] తనో
శ్రాంతి సహించి యొక్కనిదెసం గొలువుండి నెందుచేతనో
శాంతి వహించి యీపగది సంధి [illegible] నే.

ఐన [illegible] సంధివచనప్ర[illegible]వంబున నాం కేయుని [illegible] ల్లను [illegible]

ఉ. పాండునృపాలకుండు జనవంద్యుఁడు నీయనుజుండు రాజ్య మా
తండె భరించె మొన్న చను [illegible] కివు డింటికిఁ [illegible] వయ్యె నం

ఘండపు గాన నీసుతులతో సరిగా ధరఁ బంచిపెట్టి పై
నుండుము నీకుమారుల మహోదయముల్ వినుచున్ సుఖంబుగన్
అట్లు పంచిపెట్టుట కంగీకరింపవేని,

ఉ. ఆలములోన నీసుతుల నందఱి నొక్క గదాభుజంగికిం
బాలొనరించి వచ్చిననృపాలురు చూడఁగ నిచ్చువాఁడ నే
నూళలు తిండికిం బ్రతికియుండిన మీకును, 'దాసి' ప్రపంచుఁ బాం
చాలిని నవ్వినట్టి దొరసానికి భానుమతీవధూనికిన్.

ద్రౌప: నాథా! కార్తికరాకాసుధాకరతరుణకిరణసమశీలంబు లగు నీ చల్లనిమాటలచే నామనోవ్యథ తీఱినట్లే యున్నది.

భీము : ఓ పాండవగేహిని! పాంచాలరాజపుత్రి!

క. కొలఁదిదినంబులలోఁ గుఱ
కులకాంతలకుతిఁ తాఁ కొ[illegible]
గులికెడు నీకనుఁగొలుకులఁ
గలికీ! యానందబా[illegible]కణములు జాఱున్.

కృష్ణు: తనలో ఇప్పటికి మదించి యాలానం బూడఁ బెఱికి చెలఁగిన మత్త గజము మరలఁ గట్టుకొయ్యకుం జేరినది. ప్రకాశము ఓ అర్జున నకుల సహదేవులారా! మీరు చెప్పవలసినమాట లేమైన నున్నవా?

అర్జు : గీ. నడువవలసిన దంతయు నుడివె ధర్మ
తనయుఁ; డీ వేగుచుంటివి దైవమూర్తి
[illegible] సంధిఁ గావింప నొండె
[illegible] సగింప [illegible] భార మ[illegible]

ఐనను మనుజసహజం బగునహంకారత్వంబున నానుడు వలుకు లుప[illegible] బని తలంపక యాకర్ణింపుము.

క. చిరభుక్తమైన నేల న
చిరానుభూత యగు ప్రేయసింవలె బల
త్తర మగు విధిచేఁ గా నె
వ్వరు విడువం జూతు రయ్య వసుదేసుతా !.

అందును భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ ప్రముఖ నిఖిల మహారథిక సమవష్టంభ నద్విగుణీకృతావక్రవిక్రమగర్వుండును నయవినయవశీకృతసకల రాజ చక్రతోష్ణాయమాన సంపత్పర్వుండును దుశ్శాసనాదిసహోదర శతకభుజా వరణ సంభావిత సహజదైర్య ప్రాసాదాసాదితరాధేయాభిధేయసింహాస నాసీనుండును సహజదుశ్శీలకపట సదుపాయానుశ్రవీకృత తాతుండును నగు సుయోధనుం డేల విడుచును ?

గీ. వాఁడిములు మోపినంతైన వసుధ యొసఁగ
ననుచు సూచించెఁ గద! సంజయుని మొగమునఁ
బా లనక నిక్కమైదూళ్లె చాలు ననిన
ల... గద! యేల లాఘవంబు ?

అది నాతోఁచిన తెఱం గది యిట్లుండ సభాముఖంబునఁ గులవృద్ధగు గాంగే యునితోడను గులాచార్యుం డగుకుంభసంభవునితోడను నా... టలుగా విట్లు—

ఉ. సూతునిమైత్రిచేఁ బగకుఁ జొచ్చినగొంటు సుయోధనుండు; మీ
రాతనిప... వా రగుట న్యాయమ ! గాండివధారి నయు
భీతిలుచుంటి నే మన చుఁ బె... తో నని సేయువాఁడ...
తాత! గురుండ ! ... రయిన ధర్మము గావని సందలింపరే !

అట్లు మందలింపఁ జాలరేని—

గీ. పౌత్రులే యొసఁగించి రపాయ మనుచు
ఛాత్రులే చేసినా రపచార మనుచు

నెడఁదలో దలపోయక యిం తభయము
సదమదించును వాని మా సాయకమువలె.

కృష్ణు : శమదశాత్రవకులఘనాధరనకులా ! నకుల ! నీ యభిప్రాయమేమి

నకు : జనార్దనా !

గీ. అడవిబో నున్నవేళ రాజ్యాశ మనకు
లేదు, వారికి దుర్బుద్ధి లేదు నిజము ;
కష్టముల కోర్చి తుదకు భాగంబు గోర
నప్పటికి వారి కిట్టి దురాశ పుట్టె.

ఉ. అహమికచేత నట్లు కబురంపిన నంపిరిగాక మొన్న గో
గ్రహణమునాఁటఁ గోలె మది గర్వము దోఁగక పోరు పాండవ
ప్రహరణముల్ కరం బొడలిపట్లకు నాఁటినద్రోణుఁడుం బితా
మహుఁడును దక్కువారలును మాన్పుదు రేగ సంధిసేఁతకున్.

పోరికిం గాలు ద్రవ్వకుండుటకు మనబలంబుమాత్రము సామాన్యమే! ధర్మతనయుండు విరాట ద్రుపద ధృష్టద్యుమ్న కాశీపతి చేదిపతి ప్రముఖులగు మహాయోధులకుఁ జక్రరక్షకుఁడ వగు నీయొక్కయు బలపరాక్రమంబు లెఱుంగనివారే! ధర్మతనయుండు సంధికిం జొర నీఁదను గట్టితలంపు గలిగి యున్నంత పట్టును వారిట్టి ప్రగల్భంబులే పల్కుచుందు రయినను సంధి నడపుము యుద్ధమునకుఁ గూడ సంధి నడపుచుండుము.

ఉ. పోరికి సిద్ధమై యడుగఁ బోయినవారము గాన వారు మా
దారికి రాకపోవుట విదారిత కౌరవకంఠరక్తధా
రారమణీయరక్తిమ మహాశకరాళవృథాకుమారపే
వారతి వీఁగియున్న కరవాలములం బనియోగ ముండినన్.

తెరలోఁ బెద్దకలకలము తరువాత.

క. అసన్నంబయ్యెను ముర
శాసన ! దేవా ! ప్రయాణసమయం బిదె భే
రీసముదిత మగురవము ది
శాననముదాయంబు వగుల జయముగ మ్రోఁగెన్.

కృష్ణ : ఇదిగో! వచ్చుచున్నాను. చిన్నబావా! సహదేవ! నీ తలంపు వ్యక్తి
కరింపుము.

సహ : క. అడిగితిరిగానఁ జెప్పక
విడుచుట ధర్మంబుగాని విషయముగానన్
నుడివెదఁ దప్పున్నను లో
నిడుకొని నా పల్కులు క్షమియింతు రటంచున్.

ఉ. భీదతనంబు వచ్చెనని పెద్దలు నల్గురు కూడి చేసినం
గా దనరాదుగా కపుడు కౌరవనాథునితోడ వేడుకన్
జూదములాడి ధర్మతనుజుండు సమస్తముఁ గోలుపోవ బా
గోదయ మేగతిం గలుగునో మన కచ్యుత! నిర్ణయింపుమా.

పాంచాలీపరరూపముగా నాంబికేయుండె మనరాజ్యంబు మనకిచ్చె నంటిరేని.

మ. విదితంబే పృథివిం గలట్టిసకలోర్వీనాథులుం జూడ ద్రౌ
పది కయ్యంధనృపాలకుండు పరిభావంబైన పై నిచ్చుటల్;
గనయన్ గాండివమున్ ధరింపదొరకలే కింజాక్షి యార్జించిన
ట్టిది సీ! సీ! యని రోయ కక్కుటిశకూటిం బేర్మి నాసింతురే?

పోపీ! మాయదురోదరంబునన్ గెలిచిన గెలుపు గెలుపు గాదంటిరేని

మ. అభిమానంబు గలట్టిరాజుల కసత్యాలాపముల్ కూడునే?
ప్రభువుల్ గారె నలాదు! లీకరణిగాఁ బాటించిరే? గెల్తురే

యుభయుల్ జూదములం? బరాభవము రా నోడొందువాఁడేల ధ
ర్మభయంబుం గొని గెల్చువారలది ధర్మంబంచు నగ్గించెడున్!

కావునఁ బాలుమాట తలపెట్టక బలపరాక్రమంబునకు ఫలంబుగా రణభేరి
మ్రోఁగింపుఁడు.

మ. పోర నెుక్కండన నేటిమాట? బలవంతుం డెవ్వఁడో వాని దీ
ధర; పోరన్ జయమో పరాజయమొ రాదా! గెల్చి వాఁజన్యలం
దఱు మెచ్చన్ ధరయేలుకొంద మటుకాదా ? చచ్చిస్వర్గంబునం
దిరుగన్ వచ్చును మంచిక్షత్రియుల కింతే యొండు లే దెచ్చటన్.

కృష్ణ : చేతిలోఁ జలపుచు బావా! చిన్నవాఁడవైనను నా మనసు నచ్చినమా
టంటివి.

సహ : వాసుదేవా ! యీ సంధికి సుయోధనుం డొడఁబడఁడేమోయని
మాయన్నలుమ నీవును గడుఁజింతిలుచుంటిరి గాని యతఁ డంగీక
రించుట కేవిధమైన సందేహమునులేదు. ధర్మవిదులైన మాయ
న్నలు యశంబు సంపాదింతురు గాక!

ఉ. అన్నలు ధర్మవర్తను లటన్నయశం బొకఁడున్నఁజాలు వా
రన్నరనాథుసంధికయి యాస వహింతురుగాక వారితో
నెన్నటికేని యాలమది యే నొనరింపకతీర దట్లు కా
కున్నఁ బరాభవమ్మడుగునో? తల ద్రౌపది యెత్తనేర్చునో?

ద్రౌప : అన్నా ! దీనశరణ్య ! యీయాఁడుకుయ్యిగూరఁ గొంచెమా
లింపుము వేదీమధ్యంబునంబుట్టి ద్రుపదరాజునకుం బట్టినై ధృష్ట
ద్యుమ్నునకు సోదరినై స్వయంవరంబున సకలరాజ్యచక్రంబులం
జించి చెండాడిన మేటివీర లైదుగురకుం గులసతినై విశేషంబుగా
నీకుం జెలియలినై యొక్క తులపాంసనుం డంటరాని సమయంబునం
గొప్పుపట్టికొని యీడ్చి కొల్వులోపలఁ గట్టు పుట్టంబు లూడ్చి
పరిభవించిన నోర్చితి! పండ్రెండు వత్సరంబులు వనవాసంబును నొక

యేఁ దజ్ఞాతవాసంబును సలిపితి; ఇని యిడుముల కోర్చి బ్రతికియు న్నందుకు ఫలముగా నాకౌరవచండాలురవావు వినుట తప్పఁ దక్కిన కల్మిలేముల కాసించుదాననఁ గాను; వేయేల? యిమ్మేటిమగలకుఁ బౌరుషంబు వచ్చునని కదా! నేఁటికిని దుశ్శాసనార్థచ్ఛిన్నంబులగు తలవెండ్రుకలు ముడువక కట్టుపుట్టంబు విడువక జీవించుచుంటి; ఇప్పటికి నా ప్రతికూలదైవంబు వదలి నా నోములు ఫలింపకున్నవి.

కృష్ణ : అమ్మాయి! ఇఁకఁ జాలింపుము. నీ మనోగతం బెఱుంగుదు.

గీ. మున్ను నీవు సహించినయన్నినాళ్ళు
సైఁప నక్కఱలేదు సంతాపభరము;
వచ్చుచున్నది నిజము నీవలెనె కురుక
శత్రములుగూడ నేడ్చుకాలము పురంధ్రి!

తెరలో—"ఆసన్నం బయ్యెను, మురశాసన" అను పద్యము మరలఁ జదువుదురు.

కృష్ణ : బావలారా! నా కందఱు సెలవిండు. ముహూర్తము దాయ వచ్చినది.
అందఱు గొంతదూఱము సాగనంపుదురు.

ధర్మ : తనలో కురుకుల దేవతలారా! ఓ పంచభూతములారా! నా యెడల దయయుంచి మా వంశము నాశీర్వదింతురుగాక.

చ. పరమకృపాళు మాయుభయపక్షము వారికిఁ జుట్టముం జరా
చలమయ మైన యీ జగము సర్వముఁ బ్రోవఁగఁ జాలువాని ధీ
వరు వసుదేవనందనుని వారలయొద్దకు సంధి సేయఁ గ్రి
మ్మర నిదె పంపుచుంటి బతిమాలుచు యుద్ధభరంబు మాన్పఁగన్.

ప్రకాశము

గీ. తిమ్మి యనఁ దిమ్మి యగు నిది బ్రిమ్మి యనఁగ
బ్రిమ్మియే యగు వీవు, వేపలుకు లేల
యిచ్చవచ్చినయట్లు చేయింపు మయ్య,
యిరుతెగలలోనఁ గానివా రెవరు నీకు?

అందఱు నిష్క్రమింతురు.

గ ద్య

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁ
బడిన పాండవోద్యోగమునందుఁ
ద్వి తీ యాం క ము.

శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవోద్యోగము

## నాటకము

## తృతీయాంకము.

పిదప వృద్ధపురోహితుఁడు ప్రవేశించును.

వృద్ధు ; గాంధారీసహితుం డగు నాంబికేయునిచే సపరివారంబుగా మురారిం దమ యింటికి యథావిధిగాఁ దోడుకొని రమ్మని నేనే నియోగింపఁబడియు మధ్యమ పుత్రుం డగు త్రివేదిం బంపిచితి. పెద్దవాఁడగు ద్వివేదిని రాజాగారంబుననే యుండ నియమించితివి గదా! ఇఁకఁ జంటివాఁడు చతుర్వేదియు నేనును మా యింటి కతిథులై చనుదెంచిన మునీంద్రులకుం దగిన యాతిథ్యముఁ గావించు చుంటిమి.

ఉ. ఎన్నఁడు రాని పెద్ద లిపు డింటికి వచ్చిరి వారి డించి నేఁ
జన్న శపింతు రాన్నృపతిసద్మములోనికి; పెద్దవాఁడ నౌ
ట న్ననుఁ బిల్వ నంపి రకటా! యిపు డేమియొనర్చువాఁడఁ, గా
నున్నది కాకమానదు సుయోధనుఁ డేమియొనర్చునో తుదిన్.

గీ. సత్యవతి పెంచెనఁట మున్ను జనని లేని
పిల్లవానిని మాతండ్రి నెల్లయాఁడి,
నంబికాదేవి పెంచె నన్నాళ్లు; నొక్క
... ద్దువారము ధృతరాష్ట్ర నృపతి ... ను

కావునఁ జిన్ననాఁటనుండియు నతనికి ముఖ్యమిత్రుండ నై పౌరోహిత్యంబు పే
సామ్రాజ్యమే యనుభవించితి. శ్రీకృష్ణునిరాక సంధికొఱకని యెఱింగి నాతో
మెమో యాలోచించుటకే కాఁబోలు వైయానకి నాకుం గబురంపె; ఇంతకుఁ గొఱ
రాని కొయ్యలు సుయోధనాధులు తండ్రిమాట వినరు. భరతకులంబున కేదియో చేట
మూఁడినది. ఛీ! ఇంతదిక్కుమాలినయాశ కూడదు. పావ నూ పాండవులు విచ
గాంద్రవలె నైదూళ్ళిచ్చినఁ జాలు ననఁగా నేల యీరాదు ? సాక్షాత్పరాత్పరుఁడ
కృష్ణుఁడు సంధి చేయవచ్చెనని యంగీకరించునేమో! పెదవి విఱచి అబ్బే! వీని
గురువు లేఁడు దైవము లేఁడు వీని నింతనాఁటను డి యెఱుఁగుదును.

గీ. కర్ణుఁ డనుకర్ణధారుఁ డకడకుఁ ద్రిప్ప
నాకడకుఁ బోవుఁ గురునాధుఁ డనుకలంబు;
పలుఁగు లాతనితమ్ము లాపడవపలుపు
లాదరికె లాగఁ జూచెద రనుకలంబు.

ఓరీ! శకునిగా ! నీవే యీ భరతకులనాశంబుఁ దెలుపు తిత్తిరిశకునివి. ఓ రాధ
కుమారా! ఒడలి కవచకుండిలములు గూడఁ దెగఁగోసి యిచ్చిన మేటిదాతవు శరీ
ములే వేఱుగాని నీవే సుయోధనుండవు సుయోధనుఁడే నీవు కావున,

ఉ. ఈఁగికి వెన్కఁదీయకు మహీంద్రశయానుఁడు పాండుపుత్ర భూ
భాగము సంధిపేరిటి నెపంబున నిన్నడుగంగ వచ్చెఁ జూ

ఆలోచించి అయ్యో! ఎంతపె ఱిన్నైతిని; నిన్నదియొక్క ఱియే కోరఁదగనిది.

భాగముమా టటుంచుము సైఁ! నవమానము చేయకుండఁగా
నేగతి వచ్చెనో యటులనే చననిచ్చినఁ జాలుఁ గృష్ణునిన్.

ఆకాశము వంకకుఁ జెవియొగ్గి తనలో ఎవరో తలుపుదగ్గఱ నిగ్గరగా నఱచు చున్న ట్లున్నారు. (ప్రకాశముగా ఎవరయ్యా! అఱవఁబోకుఁడు, మార్గాయావంబునం బడలి జడదారులు కునుకుచున్నారు. మరల నాకసమువంకఁ జెవియొగ్గి తనలో ద్వివేది మాటవలె నున్నదే! ప్రకాశముగా నాయనా! ద్వివేది! పెరటితలుపు దారిని రమ్ము. ఈగుమ్మము తెఱచుటకు వీలులేదు.

ద్వివేది (పెరటితలుపుదారిని ప్రవేశించి తండ్రీ! నమస్కారము.

వృద్ధు : సుఖీభవ! (ఆశీర్వదించి నాయనా! మురారిని యథావిధి పురస్సరంబుగా మన త్రివేది ముసలిరాచనగరికిం దోడికొని వచ్చెనా! అచటి విశేషము లేమి.

ద్వివేది: ఇప్పటి కేవియును లేవు.

చ. విదురునితో నెదుర్కొని త్రివేది యొనర్చిన యర్ఘ్యపాద్యసం
పదఁ గొని వారితోఁ గలిపి పట్టణకాంతలు చల్లుసేసలె
ల్లఁ దనశిరంబునం బడ విలాసముగాఁ జనుదెంచెఁ గామినీ
మదనుఁడు శౌరి మత్తగజమందగతిన్ ధృతరాష్ట్రు నింటికిన్,

వృద్ధు : తరువాతఁ దరువాత.

ద్వివేది: మత్సమర్పిత చందన తాంబూలాదులు కరంబునం దాఁకి సర్వశృంగారితం బగు బంగారుగద్దెమీఁదఁ గూర్చుండి చుట్టుం బరివేష్టించి యున్నతాసనంబుల నున్న మన దొరలతో నుచిత ప్రసంగంబు గావించుచుఁ గొంతతడ వుండి-

క. విదురాదుల యింటికిఁ జని
యెదఁ గా కని చి యంధనృపదంపతులం
జదురున వీడ్కొ ని కుంతీ
సదనమునకుఁ జనియె విదురసహితుం డగుచున్.

ద ప్పనుట తగునె సభలో
నెప్పుడు గురువంతవాని కేనియుఁ గుమతీ !

ద్రోణు: రాధేయా ! శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని పాపమునకుఁ గారణము చెప్పనే చెప్పినాఁడు మఱియున్ జెప్పవలసినఁ జెప్పఁగలఁడు నడుమ నీ కీదుందుడు కెందులకు?

చ. సరసపుదారి బో కెదిరిశక్తి యెఱుంగక పాడిమాలి ఘూ
వరునకుఁ గూడ్చువాఁడ నని వా యెటువచ్చిన నట్లు ప్రేలఁగా
నురు వరుదెంచునో! యెరు లహో! యని మెత్తురా! సూతపుత్ర! న
ల్వురు చనుత్రోవఁగా నడుపఁబో విది యెచ్చటి పాపకర్మమో !

దుర్యో: ఊరకుండు మని కనుసన్న చేయును.)

కర్ణు : ఏకసక్కెముహా ఓకుంభసంభవా ! ముదిచే మది తప్పిన గాంగేయునితో పాటు నీకును మతి పోయెనాయేమి?

శా. కూడుం గుడ్డ యొసంగి ప్రోచునిభు నొక్కొం డెవ్వఁడోవచ్చి దూ
ఱాడం జూచుచు నూరకుండుటకు ద్రోణాచార్యుఁడో భీష్ముఁడో
కాఁ డీకర్ణుఁడు; లోన నొండుఁ బయి నొక్కం డూహ లేకుండ నీ
యోడం బ్రాణములైన వీడుటకు వీఁ డున్నాఁడు సిద్ధంబుగన్.

ద్రోణు: క. ఆతనివృద్ధత్వమ్మును
నీ తారుణ్యంబు నూడ నీకును ధనుపున్
జేతఁ గొనువారి కెల్లఁబు
రాతనగురుఁ డైన పరశురాముఁడె యెఱుఁగున్.

అశ్వ : ఓయీ రాధేయా ! సుయోధనదయాసంపాదితాంగదేశసామ్రాజ్యధౌరేయ ! సేవకుఁడ వగు నీ కుచితంబు లగుధర్మంబులు భీష్మాదులకుఁగూడ నుపదేశించుచున్నావు. న్యాయపక్షపాతులకుం బభు చిత్తానుసరణం బనావశ్యకము.

వృద్ధు :రాయబారపు సభయేనా? భీష్మాదికులవృద్ధులును ద్రోణకృపాశ్వత్థామాది గురు పరంపరయు శకుని మొదలగు బంధువులును కర్ణ వికర్ణాది సామంతరాజు లును దుర్యోధనాది కుమారులును గొరువఁ బుట్టినది మొద లాంబికేయుండు చేయు నోలగంబులలో నిదియే నిండోలగంబు. తెరలో నేను గూడ మెల్ల మెల్లన నేగుదునా ? ఆలోచించి కననా! వినవా!

గీ. యదుకుమారుపల్కు లాలించెద నటన్న
నతనిరూపు చూతునా! యటన్న
కనులు కానరావు, వినరావు కర్ణంబు
లేమిచేయువాఁడ నేగి నేలు

ద్వివేది: అయ్యా! నాకు సెలవిండు, నేను మరల వచ్చి సర్వము వినిపించెద.

వృద్ధు : మంచిది. నేనును రవంత సేపు విశ్రమించెద.

నిష్క్రమింతురు

ఇది విష్కంభము

పిదప భీష్మ ద్రోణులతో గాంధారీ సహితుఁడైనధృతరాష్ట్రుడు ప్రవేశించును)

ధృత : తనలో

క. దుర్యోధను నంపితి శుభ
చర్యన్ శ్రీవాసుదేవు సభకుఁ బిలువఁగన్
మర్యాదగఁ బిలుచునొ యీ
యార్యేతరుఁ డతనిఁజెనకి యవమతి గనునో!

అంత విదురసాత్యకుల చేయూఁతఁ గొని శ్రీకృష్ణుఁడును వెను
వెంట దుర్యోధనాదిదుష్ట చతుష్టయమును గృపాశ్వత్థామవి
కర్ణులను బ్రవేశింతురు. భీష్మాదులందఱును లేచి
నిలుచుందురు.

భీష్మ. వాసుదేవా! నీ వాయాసనము నధిష్ఠింపుము. చేతఁజూపును.

కృష్ణ: చేతఁజూపి ఈ సభావిశేషములఁ దిలకింపగోరి నానాదిక్కుల నుండి మహా మును లనేకులు వచ్చియున్నారు. ముందు వారి కాసనము లేర్పఱచి పిదప మనము కూర్చుండుట యుక్తము. ఆకాశము వంకఁ జూచి మఱియు

క. నాకముననుండి వచ్చిరి
లోకైకనుతుల్ మునీంద్రలోకము వారిన్
దేఁకువమై నర్చించి క
దా! కూర్చుండుటకు మనకు నవకాశ మగున్.

నారదాదులు ప్రవేశింతురు. అందఱును గూర్చుందురు. కర్ణదుర్యో
ధను లొకచేయాసనము నధిష్ఠింతురు.

కృష్ణ: చిఱునవ్వునవ్వుచు మామా! సత్యవతీపౌత్ర! ధార్తరాష్ట్ర లకును బాండ వులకును సంధి గావించి యీ రాజలోకమునెల్లఁ గాపాడుమని నిన్ను యాచించుటకై పాండవదూతనై నీ యొద్దకు వచ్చితిని.

క. తమ్ముని కొడుకులు నగపా
లిమ్మని రటు లిష్టపడవయేనియు నైమా
శ్లిమ్మని రైదుగురకు ధ
ర్మమ్ముగ నీతోఁచినట్లు మనుపుము వారిన్.

క. తనయుల విడిచెదవో యీ
తనయులతో నేమి యని స్వతంత్రించెదవో

చను మొకదారిని లేదే
నని యగు వంశక్షయంబు నగుఁ గురునాథా !.

మ. చదువున్ నీతియు శాంతి దాంతియు విశేషఖ్యాతియుం జాతురీ
కదనాటోపములుం గలట్టి నృపలోకంబెల్లం నగ్గించునం
పద సొంపారుకులంబు మీకులము, మీవా రందఱున్ నిత్యస
త్యదయాశాలులు కీర్తి నిల్పుకొనవయ్యా ! పాండురాజాగ్రజా!.

చ. పతితులు గారు నీయెడల భక్తులు, శుంఠలు గారు విద్యలం
జతురులు, మంచివారు, నృపసంతతికిన్ దలలోనినాల్క, ల
చ్యుతునకుఁ గూర్చువారు. రణశూరులు, పాండవు లట్టివార లీ
గతి నతిదీను లై యడుగఁగా నిఁక నేఁటికి సంశయింపఁగన్.

ఫలితార్థంబుఁ జెప్పితి నట్లు చేయఁదలఁపనిచో వా రేగురును ద్రౌపది
యు వేర్వేఱ నీతోఁ జెప్పుమనిన మాటలు ప్రకృతానుపయోగంబు లగుటం
జేసి విరమించితి.

ధృత : అల్లుడా ! వాసుదేవ ! సర్వ మెఱింగియు నన్ను నెపపెట్టు చున్నావు.

గీ. గ్రుడ్డి నగుటచేతఁ గొంతకాలం బేలెఁ
బుడమిఁ బాండురాజు; కొడుకు లిప్పు
డేలుకోఁ దొడంగి రీ కారణంబున
గ్రుడ్డి దయ్యె మాటకూడ నాకు.

క. కొడుకులు తండ్రుల మాటల
కడుగై నను దాఁట రనెడియశమున ధీ
ష్మఁడె చిట్టచివర మావం
గడము జనించినది మొదలు కంసధ్వంస!.

విదు : జనాంతికము అన్నా! నిన్న శ్రీకృష్ణుని రాక విని పరమానందంబు నంది
యయ్యనఘున "కది యిచ్చెద నిది యిచ్చెద" నని

వృద్ధు : కన్నకొడుకులు కావలసాలై కుందుచుండ దాయాదుల యింటంగుడుచుచు నడలుచున్న కుంతికన్నుల కిదియే మొదటి పండువు. తరువాతఁ దరువాత

ద్వివేది: తరువాత దుర్యోధన మందిరంబునకుం బోయి యచట "విందారగించు" మని యెంత వేఁడినను బగఱయింట; గుడుచుట తగదని తగినసమాధానంబు చెప్పి విదురుని యింట భుజించుటకుం జనియె. నేనును మఱలి వచ్చితిని.

వృద్ధు : శ్రీకృష్ణుఁడేగునప్పటికి రారా జేమిచేయుచున్నాఁడు.

ద్వివేది: కర్ణ శకుని సైంధవ ప్రముఖులతోఁ గొల్వు దీర్చియున్నాఁడు.

వృద్ధు : పెదవి విఱిచి) కావుననే శ్రీకృష్ణుఁడు కౌరవరాజు ననాదరించినాఁడు. అదిగాక మొదటి నుండియు బలరామునకు సుయోధనునియందును శ్రీకృష్ణునకు బాండవులయందును నభిమాన మెక్కుడు. ఈ యభిమానములు కతముననే కదా! ఆ పెండ్లి కన్ని చిక్కులు ఘటించినవి ?

చ. "పరమ దరిద్రుఁ డే నొసఁగఁ బట్టిని ఫల్గున సూతి" కంచు సం
బరపడి సీరి లక్ష్మణకుమారకు నేరి యొసంగెఁ బెండ్లికిం
దరలితి మా వివాహపు విధానము లేమనఁ ! బావు తప్పి వ
చ్చిరి దొర, లాఘటోత్కచుఁడుచేసె వివాహము పార్థసూతికిన్.

ద్వివేది; వెనుకసుభద్రమ్మగారినిగూడ బలరాముఁడు దుర్యోధనునకీయఁదలంపఁగాఁ గృష్ణుఁడు పార్థునకుఁ బెండ్లి చేసెనని విందుము

వృద్ధు : అవును. మొదల నుండియుఁ గృష్ణునకుఁ బాండవులయందే పక్షపాతము.

ద్వివేది: నాకు సెలవిందు. త్వరగ భుజించి మరల సభా ముఖంబున కీ ఋషుల నందఱిని వెంటనిడుకొని పోవలయు.

యువొప్పొంగితిని కదా ! యీమైదుూళ్ళను నతనికే యిచ్చితి ననుకొని యీకయ్య మాఁపరాదా ! మన కిట్టిసమయము మరలఁ దటస్థింపదు సుమా ! యోజించుకొనుము.

ధృత : వినీవిననియ ట్లూరకుండును.)

కృష్ణు: (తనలో ఈమదునలి యిప్పుడే తనవాచాకౌటిల్యమును జూపించుచున్నాఁడు. (ప్రకాశముగా ఎఱుఁగుదు నైనను పెద్దవాఁడవని విన్నవించితి.

ఉ. అట్టికులంబునం బొడమి యట్టిమహాత్ముఁడు పాండురాజు తోఁ
బుట్టినవాఁడుగాఁ బుడమిఁ బొంపిరి వోవఁగ నేలినట్టి నీ
కట్టిన పాప మెట్టిదియొ కష్టము రానయియుంబెఁ బుత్రులం
బట్టి, యి దెట్టు లేఁగెదవొ పార్థివసత్తమ! నీతివిత్తమా!

)యోపినకొలఁది చెప్పిచూడుము. కార్యము దుర్భరంబు కావున నింతగా నీతోఁ గూడఁ జెప్పవలసివచ్చినది. వారిచే శుశ్రూషనే చేయించుకొనెదవో సంగర మునే చేయించుకొనెదవో యది నీయం దున్న యది ఇందులకును నందులకు వారు సంసిద్ధులై యున్నారు.

)ృత : వాసుదేవా! నాయోపినంత నీయెదుటచే యుపదేశించెద.

)ర్ణు : నందనందనా! అతఁడు పాపమే గట్టెలో పుణ్యమే గట్టెనో ప్రకృతము మన కది విచార్యము కాదు. అధికప్రసంగము గావించుటకుఁ బ్రాజ్ఞు లొప్పరు. దూతవై వచ్చినవాఁడవు నీవక్తవ్యాంశ మేదో చెప్పుకొనుము.

ష్ణు: (కపముతో ఓయీ ! సూతపుత్రా ! నందనందనుని మాటటుంచుము; నీకీయధికప్రసంగమునకై యెవ్వరధికార మొసంగిరి?

క. చెప్ప దొరకన్న విషయం
దొప్పో! తప్పో! ముగింపకుండ గ నడుమన్

ఉ. గొంటుతనంబుచేఁ దలపఁ గూడని చెయ్వులు చేసె రాజు నీ
యంటున నిక్కమందు సభ నందఱకున్ విశదంబ చేసె నీ
కంటస మౌత; పల్కిబడి కందున చందము లేకయున్న నీ
వింటరపాటుఁ జెందుటకు హేతువు చెప్పుము సూతనందనా!

విక : ద్రోణాత్మజా! న్యాయపక్షపాతులకుం బ్రభుచిత్తానుసరణం బనావశ్యకం బని కదా! యిపు డుగ్గడించితివి. కాని యిది యీగాంగే యాదులయెడలం బ్రయోగింపఁ దగనిది. ఏమంటివేని?

మ. అభిజాతత్వము కల్గు పాన సతి యంపై యుండఁగా దుర్మదా
రభటిం గొల్వున కీడ్చి తెచ్చి కటివస్త్రం బొల్వగా "దాసి వీ
సభలో నిందు వసింపు" మంచుఁ దొడ యాస్ఫాలింపఁగాజూచి రా
జభయంబుం దిగఁద్రాని జేని కిది దుష్కార్యం బనంజాలిరే !

అశ్వ : ఓయీ! వికర్ణ! అది యొక గొప్ప కార్యమని సుయోధనాధులం బ్రశంసించిరా! నీవు నాలుగు ధర్మవాక్యములు నాఁడు నుడివినంతనే వారికన్నఁ బెద్దవైతివా! దాని కంతకుం బ్రథమకారణంబు నీ తండ్రియే కదా!

క. మోహితులు కన్నుఁ గానక
సాహసకృత్యములు చేయు సమయంబున ని
ర్వాకహాము లగునె వలదని
బాహిరముగఁ జేయు ధర్మవచనము లెందున్.

కావునఁ దులువ లొనరించుదుష్టచేష్టలు నివారింపఁ బూనుకంటెఁ బెద్దల కూరకుండుటయే పరమధర్మము. "అతు శక్తైః పుణ్యపాపైరిహైవ ఫలమశ్నుతే" యని శాస్త్రంబులు నాకొనుచున్నవి.

చ. చెవఁటులు చేతఁగాని ని చేసి కొలంబున లఁ గీడు మూఁ
డునటులు మించినందుల కిటు ల్పనుదెంచె ఫలంబు తోడుతో

దన కనుఁగొమ్ము వచ్చిరి హుటాహుటి నేఁటికిఁ బాండురాజనం
దనులు చలంబు మీఱఁ గదనంబునకుం గురురాజుమీఁదికిన్.

దుర్యోధనుండు సకుటుంబముగా నశించునుపాయంబు లంగరాజునకుందప్పఁ దక్కిన వారికిం దెలియవు. లేదేని,

ఉ. కచ్చియ మాన్పి కౌరవులఁ గాంచితలంపున సంధి సేయఁగా
మచ్చిక నేగుదెంచి హరి మంచియొ చెడ్డయొ చెప్పుచుండఁగా
నచ్చపు రాజభక్తి గలదంతయు వెల్లడి చేయు భంగి నీ
మచ్చరి సూతపుత్రుఁ డభిమానముచేఁ గలహింప నేటికిన్?

కర్ణు : (ఎక్కసక్కెముగా) నిరభిమాన బ్రాహ్మణకులసార్వభౌమ! లక్షణమాత్ర పరిజ్ఞాతధనుర్వేదసార! ఆచార్యపుత్ర!

చ. కదనము సేయ వచ్చి రని కంది ముకుందునిమాటచొప్పునం
బెదరి సుయోధనుండు తనవీరము నీరముపాలు చేసినం
బెదరఁగ సూతనందనుఁడు పేదుబు గాఁడు చతుస్సముద్రముల్
చదరముగల్గు నీపుడమి క్షాత్రవశూన్యముఁ జేయకుండఁగన్.

అశ్వ : (పట్టరాని కోపముతో) ఓరీ అధిక వాచాల! రాధానందనా! ఇంకెన్నినాళ్ళు బీతములు పల్కెదవురా?

మహాస్రగ్ధర.

విలయాంభోదాంబుధారావిసరమువలె నుర్వీవియన్మధ్యభాగం
బులు నిండన్ వేలుబాణంబులను వదలు విల్కాని గాండీవి "కర్ణా !
నిలు మోరీ! పాఱుఁబోతా! నిలు నిలు" మనుచు న్నిన్ను వెన్నాడఁ జూడ
న్గలకాలం బేగుదెంచెం గరువము వల దుగ్రంపు యుద్ధంబునందున్.

ధృత : తండ్రీ! గురునందన! మనమందఱముం గార్యార్థులమై వచ్చిన వాసుదేవు నావలకుం బంపు యోజ యోచింపవలయును గదా! మీ కీయకారణ పరస్పరకలహము లేల? రాధేయా! నీ విఁక నసహ్యధేయవాక్యంబులకై ప్రయత్నింపకుము. పెద్దవాఁడ నని యయిన మీరెల్లరు నా విన్నపము

చెల్లింపుఁడు చేతులుసాచి వెదకుచు మా సుయోధనుఁ డెక్కడ? నాయనా? దగ్గఱకు రమ్ము.

దుర్యో: తనలో ఇతఁడేమేమో కొఱగానిపల్కు లుపదేశించును. కానీ! వించను. తండ్రియొద్దఁ గూర్చుండును.

ధృత : కుమారా! చేతులతో దగ్గఱకుఁ దీసినికొని

మ. ఇంద్రియదుర్మదంబు మొద లేదఁగఁ ద్రుంచి మనంబు వంచి ని
ష్టం ద్రిగుణంబు వాపెడు విచారము సేయుమునీంద్రు లేదయా
సాంద్రునిరూపుఁ జూచుటకుఁ జాలక కుందుదు రట్టివాఁడు ని
చ్చెం ద్రుహిణేంద్రవందితుఁడు చేరువకుం బని గల్గి దూత యై.

కావున నయ నఘుమాటలు నిరాకరింపక ప్రత్యుత్తరము చెప్పుము.

దుర్యో : నేఁడు క్రొత్త లేమున్నవి? వెనుక సంజయుఁడు చెప్పిన మాటలో యాతఁడును జెప్పను. అందులకు నే నంగీకరింప నని యెఱుఁగనివా రెవ్వరు?

ధృత : తండ్రీ! అట్లు కాదు. భీష్మ ద్రోణ కృపాశ్వత్థామప్రభృతులగు మన మహారథికు లందఱును సంధి కొడంబడుటయందు కృతనిశ్చయులయి యున్నారు. వారైనను–

శా. "ఐదూళ్ళిచ్చినఁ జాలు మా" కనిరఁ టన్యాయంబుగా నేల దా
యాదద్వేషము? మేటిసంగరము సేయంజాలుదే? నీకుఁ "గ
ర్ణాదుల్ గల్గ భయం బిఁకేల" యనుధైర్యం బుంచెఁగాఁబోలు నేఁ
డేది! తెల్పుము కవ్వడింపొదరువా రెవ్వారో? నాముందఱన్.

గాంధా : కుమారా! మీ తండ్రిగారిమాటలు వినుము. పెక్కు దేశంబు లుండఁగా నైదూళ్ళ వారి కిచ్చినంతనే నీకుఁ గొదవ యగునా! పెద్దలమాట లేల నిరాకరించెదవు? చిరకాలమునుండి తఱచుగా నీ కురువంశమున రాజ్యము కనిష్ఠకుటుంబమునందే నిల్చుచున్నది. యయాతి సుతులలో జ్యేష్ఠుం డగు యదునృపాలుఁడు మదోన్మత్తుఁ డగుటంజేసి యాతనికి రాజ్యంబు రాక

పితృభక్తిరతుఁ డగుపూరు నరపతి కయ్యది సంఘటించె. పదపడి మీ ముత్తాతలు దేవాపి బాహ్లిక శంతనులు మువ్వురలో రోగగ్రస్తుం డగుకతన జ్యేష్ఠుఁడు ప్రజాసమ్మతుఁడు గామింజేసి కనిష్ఠుం డయ్యును శంతనుండె పట్టాభిషిక్తుం డయ్యె. పిమ్మట దేవవ్రతుఁడు జ్యేష్ఠుం డయ్యు మీ తాత యగు విచిత్రవీర్యునకు రాజ్యంబు సంక్రమించుటయు మీ తండ్రి సమక్షమ్మునఁ బాండునరపతి రాజ్యం బొనర్చుటయు నీ వెఱుఁగనివి కావు కావున లోభం బుడిగి మీరును మీరును బంచి కుడుచుట శ్రేయస్కరంబు మమ్ముఁ దుష్టతుదకు దిక్కుమాలినవారిఁగా నొనర్పకుము. పెద్దలమాట విని బ్రతుకుము.

ధృత : పుత్రకా! ఇంకొకవిశేషముఁ జెప్పెద నాలకింపుము.

గీ. లోకములు భస్మ మగు సర్వలోకసుతుఁడు
ధర్మరా జల్గెనేని; యతండు కుదురు
ధర్మమున; కాడి బొంకఁ డుదార చరితుఁ
డగడువడకుము యుద్ధంబు తగదు కొడుక!

జనాంతికము తండ్రీ! మీయమ్మమాట నిజము.

ఉ. వెనుకటినుండి రాజ్య మది పెద్దకుటుంబములోన్ఁగ్గోనుంట యీ
మనకులమందు లేదు కనుమా; మను శంతనుఁ డెట్టివాఁడొ! మ
జ్జనకునిచంద మెట్టిదియొ! సజ్జనమాన్యుఁడు పాండురాజు తా
జనపతి యౌట యెట్టిదొ! నిశాంపతి ధర్మజుఁ డౌట యట్టిదే.

కావున నీ వృద్ధాపచారం బతనినే రాజుగా నాకుఁ దోపించుచున్నది. నీవు మాఱు మాటాడక సంధి కొప్పుకొమ్ము. లేనిచో సర్వమును గోలు పోవుటయు లోనగు ననేక కష్టములకు లోనగుదువు.

గాంధా : అయ్యా! వారు తమ భాగంబునకై పెనంగువారు గాని యధర్మవర్తనులు గారు. ధర్మమే జయించు నందురు. అదియునుం గాక పితామహ గురు

కృపాచార్య ప్రభృతు లందఱు న్యాయపక్షపాతులు. న్యాయంబున కొడం బడి పండ్రెండువత్సరంబులు వనవాసంబును నొకయేఁ డజ్ఞాతవాసంబును సలిపి తమ తండ్రిపాలికై పోరాడఁ జాలియు బంధునాశనంబునకున్ జంకి కదా? "యైదూళ్ళిచ్చినఁ జాలు" నని మురారి ననిపించిరి. అట్టి ధార్మికులయెదుటఁ ద్రిశూలధారి యగుశంకరుండును నిలువనోపఁడు పద్మాక్షుండు గూడ వారిపట్టైయి యున్నవాఁడు కావున నీ నూర్గురుతమ్ములం గాచికొని పాండవసహితుండవై జగంబు నిష్కంటకముగ నేలికొనుము.

దుర్యో : తల్లిదండ్రులారా! మీరు చెప్పవలసినవారు కావునఁ జెప్పిరి. కాని,

క. ఐదూ ళ్ళిచ్చినఁ జాలును
లేదే నని సేఁత నిజము లెం డనుచున్ దా
యాదులు కబు రంపిన నే
నీఁదలఁచుట వారి కోడుటే! యగుఁ గాదే?.

ఐనను బెద్దలమాటలు నిరాకరింపక యిచ్చితినే యనుకొనుఁడు,

గీ. మొదటనుండియు మేము మేమును బరస్ప
రాపకార మొనర్చుకొన్నట్టివార
మైతి మేగతి గలియు నన్యోన్యమైత్రి
లోనిపగలును బయిలిచెల్మిలును గాక!

వారు బలవంతులై మమ్ముం బెనకుదు రని కలలోనైనఁ దలంపకుఁడు.

చ. సమరము చేయరే బలము చాలిన! నట్టివారుఁ జూచుచుండఁ ద్రౌ
పదిమము పెఱవారిచేఁ గటకటం బడఁ జూచుచు నూరకుందురే ?
మమతయుఁ గొంకు మాన మవమానము సిగ్గును లేనివారినె
య్యము తగునయ్య! భూమిపతు లందఱు నవ్వరెఁ టయ్య! చేపివన్.

శా. రాధేయుండును నేను దమ్ములును సంగ్రామంబులో నిల్వ నా
కాధీశుం డరుదెంచుగా నెదుర శక్యంబే! వృథా భ్రాంతి గా
నీ! ధర్మం బని కాన నేగుదురె పండ్రెండేండ్లు తేజోబల
ప్రాధాన్యంబు గలట్టి రాచకొడుకుల్ పౌరవ్యవంశాగ్రణీ?

అదియునుం గాక.

క. తమ్ముని తనయులకుం పా
లిమ్మనెద వయో! యమానిలేంద్రాశ్వినులో
తమ్ములు! పాండునృపాలుఁడొ
తమ్ముఁడు! వివరింపు మయ్య తండ్రీ! నీకున్.

గాంధా : నాయనా! నీకా యప్రస్తుత ప్రశంస యేల? తీఁగ కదిపిన డొంక యంతయుఁ గదలును. ధర్మశాస్త్ర ప్రకారముగ వారలకుంబాలు లేదంటి వేని యావచనములు చెప్పి యీసభాసదుల నొప్పింపుము.

జమదగ్ని : జాబాలితో జనాంతికము చూచితివా యీ గాంధారి చాతుర్యము! పాండవులం గుండులని యాక్షేపించినఁ దనకుమారుల నెవ్వరేని గోళకులని నిందింతు రేమోయని యీ ప్రస్తావన ముగింపుమనుచున్నది. కానిమ్ము, సభాముఖంబునఁ బతివ్రతల నవమానపఱచుట మన కేల?

జాబాలి : అగును, తొల్లి యీగాంధారిం బరిగ్రహించిన వాఁడు మృతుం డగునని కార్తాంతికులు నిర్ణయింప గాంధారధరణీపతి ముందుగాఁ దనకూఁతు నొక యజపోతమునకుం బెండ్లిచేసెనఁట! పిదప నాంబికేయునకుం బరిణయము చేసెను. ఎందుఁ జూచినను మహాత్ముల చరిత్రములు విచిత్రములు. అందుఁ గౌరవుల చరిత్రము మిగుల విచిత్రము.

దుర్యో : త ! నీవు ధర్మశాస్త్ర మని ఘోషించుచున్నావు. అట్లేని రాజ్యము జ్యేష్ఠ

కుటుంబములోనిదే గాని కనిష్ఠకుటుంబములోనిది కాదు. తండ్రిగారి యవివేకమువలన మొట్టమొదట వారి చేతిలో యర్ధరాజ్య వచ్చినది, కావున వా రిప్పుడు నా పైకి దాడి వెడలుచున్నారు. ఇది కేవల మధర్మము. నీవు చెప్పిన చొప్పున ధర్మమే జయించునేని నాకే జయ మబ్బుఁగాక. యోజించి) నా కాధర్మశాస్త్రప్రశంస యేల? రణంబున వినుము.

గీ. పగఱ గెలిచితినేని యీ జగతి నేలు
కొనెద ననుజన్ములును గొడుకులును గొలువ
శత్రువులు గెల్చిరేనియు సపరివార
మనుభవించెద నాకలోకానుభవము.

ఉ. "శౌరి వచించుమాటలకు జంకినమీయుపదేశ మేము వి
న్నారము కా" మటంచు మఱి నాన వహింపకుఁ డమ్మరో! నమ
స్కారము "రాజరా" యనుచు సార్థకభావము దాల్చినట్టి వా
పేరు జగంబున న్నిలుప వేఁడెద నట్టు లనుగ్రహింపుఁడీ.

ధృత : కుమారా ! నీవు యుద్ధమందుఁ గృతనిశ్చయుఁడవై యుంటివి. తోఁకఁ ద్రొక్కిన మహానాగంబులకరణి నీపయి కుఱుకఁ జనించుచున్న పాండవుల బలపరాక్రమంబులు నా కడుపులోఁ జేయి వెట్టి కలఁచుచున్నవి.

చ. "భరతకులంబు పేరు నిలుపం దగురా!" యని తల్లి వేఁడ వ్యా
సఋషి మహామనీషి మనసంతతి నిల్పెఁ గదయ్య! తాత సం
సరణము రోసియుం బరవసంబునఁ బెంచెఁ గదయ్య! దాని నే
లరమరమై కుటుంబకలహంబునఁ ద్రుంచెదవయ్య పుత్రకా?.

గాంధా ; తండ్రీ ! వాయునందనుండు జరాసంధ హిడింబ కీచకులం జంపె నని విన్ననాఁటనుండియు నా కడుపు బిగ్గుబిగ్గున మండుచునే యున్నది. మీ సహా

ధ్యాయు లైదుగురలో నొక్కనిచేతం దక్కన నల్వురుం జావఁగల రని మీగురుండు శపించె ననికూడ వినియుంటిని. అందు భీమసేనుని చేతం బడుటకు నీ వొక్కఁడవ మిగిలియుంటివి; కావున సంధి; గావించుకొని నీ ప్రాణంబులు నిలుపుకొని సుమ్మీ దుఃఖపారావారముం దాఁటింపుము.

దుర్యో : తల్లీ ! కుడిచికూర్చుండక యేల యి ట్లమంగళవాక్యము లాడెదరు?

గీ. భరతకులమున కేల లోపంబు రెండు
తెగలవా రనిఁ జచ్చు టెందేనిఁ గలదె?
సంధి చేసినఁ దప్పునే చావు ? గురుని
శాపవచనంబు నిజముగా జరుగునేని.

మ. చన దే నిట్టిద నంచుఁ జెప్పికొన; మీ సందేహమున్ దీర్పఁ జె
ప్పనుడు ల్వా యివి; ద్రోణుని న్గృపుని భీష్మ న్ద్రౌణి నెట్టెట్టు లీ
వనిలో నెంచెదొ నన్ను నంత కధికుం డం చెంచుమీ ! యస్త్రశ
స్త్రనికాయంబులపట్ల బాహుబల ధైర్య స్థయిర్య శౌర్యంబులన్.

మీ రెంతసేపుచెప్పినను పిచ్చి సంజయునిమాటలు విన్నది మొదలు వారికి దేవతలుగూడ సహాయు లగుదు రని చెప్పుచున్నారు. అది కేవలము పొరపాటు. కామక్రోధాదులకు వశులై గీర్వాణు లెప్పుడును వర్తింపరు. అట్లు వర్తించి రేని వారికి దేవత్వమే నిలువదు. కావున వారును మనుజులు, మేమును మనుజులము. సర్వవిధముల మా బలపరాక్రంబు లెక్కుడు. భవితవ్యము నేను మున్నే నిర్ణయించి యుంటి దాని నాలించి స్వస్థతఁ గైకొండు.

చ. అవిఁ దెగటార్తుఁ బాండవుల నందఱినిన్ ద్రుపదాత్మజాతుతో
వనరుహనేత్రుతో నృపతివర్గములో సచిరంబ, స్వాస్థ్యమున్.

గని పొనరింతు యజ్ఞములు, కాంచనమున్ మణు లగ్రహారముల్
ఘనులకు నిత్తు విప్రుల కఖండవదాన్యులు నన్ను మెచ్చఁగన్.

ధృత : తనలో అమంగళము శాంతించుఁగాక! వాగ్దేవత భావికాలానుసారిణియై ప్రవరించును గాఁబోలు!

కర్ణు : తల్లీ ! గాంధార రాజనందని

ఉ. తాపసికిం జనించినకతంబునఁ బోరికి వెన్కఁదీయునా
లాపము లాడుఁగాక వికలంబుగఁ బుత్రులతోడ జేఁడు; నీ
వే పెడలం గుమారకుల కిట్టిదురుక్తులు చెప్పఁబూని తె
ట్లో పరుపైన క్షత్రియకుటుంబములోపలిదాన వక్కటా!.

ధృత : తనలో ఈ సూతనందనుని మైత్రియే నాకులంబున కింత చేటు తెచ్చినది. కోపముతోఁ బ్రకాశము ఓరీ! కురుకులకాంతారదవానలాభిధేయా! రాధేయ! ఇం కేమి చేయించెదవురా!

సీ. కలసి నీరక్షీరములభాతిఁ దనరారఁ
దగుబిడ్డకుఁ బగ ల్దాపి తీవు
ధర్మరాజును మాయదారి పై రావించి
వంచించి జూద మాడించి తీవు
ద్రుపదమహారాజుదుహితను రచ్చ కీ
డ్పించి పుట్టంబు లొల్పించి తీవు
కూడుగుడ్డకు దూరగులఁ జేసి పాండవ
వీరుల నడవి కన్పించి తీవు

గీ. సంధి పొసఁగింప వచ్చిన శౌరితోడ
నడ్డదిడ్డంబు లాడించి యంపుచుంటి
విచ్చవచ్చినరీతఁ జేయింపు మౌర!
భరతవంశంబు బ్రతుకు నీ పాలఁ బడియె.

గాంధా ; మహారాజా! మనసంతానమును మందలింపఁజాలక యొరుల దూషించిన

ప్రయోజనం బేమి? మీ రన్నమాటమాత్ర మసత్యము కాదు. పాండవ మధ్యముని గెలువఁ జాలుదు ననుకర్ణు ప్రగల్భము- సుయోధనుఁ డిట్లు కేగుటకుం గారణములు.

వికర్ణు : కురుకులేశ్వర ! నీ కుమారునితో మైత్రి గావించినరాధేయునకుం దగిన బిరుద మిప్పించితివి.

గీ. దొరవు నీకన్న కొడుకులతో సమముగఁ
బెంచితివి మాకుటుంబముఁ బేర్మిమీఱ
నీదుమాటల కెదురాడరాదు గాని
యీ వెఱుంగనిపని చేసి రెవరు చెపుమ!.

పాండవులయం దంతగా నీకు నిక్కమగు వాత్సల్య మున్నయెడల

మ. పరులం దూఱఁగ నేల! వారి నిటు పిల్వం బంచి యీవేళ యు
ర్వర సర్వంబును ధారవోయఁగ స్వతంత్రత్వమ్ము లేకుంటివో!
ధరణీనాయక! యేల యిట్లు తిధిచేతం బాముఁ జంపించు నే
ర్పరిచందంబున మెచ్చులాడెదవు? మీ వారంద ఱాలింపఁగన్.

అదియునుం గాక—

చ. ఇలఁగలసర్వరాజుల జయించిన వీరులు పాండురాజపు
త్రులసిరి చూచి యోర్వమి విరోధము పూని సుయోధనుండు వా
రలయెడఁ జేసినట్టియపరాధము లన్నియు సూతపుత్రు నొ
దలఁ బడవేయు టేన్నృపతిధర్మము? కౌరవవంశభూషణా!.

దుర్యో : కుమార ! వికర్ణ! ముదిమిచే మదితప్పిన యీ మహారాజు మాటల కఖిమాన మేల? తండ్రితో అయ్యా! నా బాహిఃప్రాణం బగుకర్ణ ననుట యొకటియు నన్ననుట యొకటియునా? ఇంకొకసారి యిట్టికర్ణశూలాయమానంబు లగుదుర్భాష లాడితివేని,

గీ. అంబికావంశశాఖ కీ వగు దొకండు
కట్టకడదాఁక గాంధారికడుపు మందు

వవని యంతయుఁ గైవసం బడును బొందు
రాజనుతులకు నీ మనోరథము నిండు

కర్ణు : చెవులు మూసికొని) పాపము శాంతించునుగాక! మిత్రమా! ఈ మహారాజు వాక్యములు విని నా మనసు విఱుగు ననియా! యిట్టి యశ్లీల వాక్యంబు లాడుకొనుచున్నావు! వాలుఁజాలు లిన్నాళ్ళ మైత్రి గావించితినిగాని కర్ణుని మనోనిశ్చయంబు గుర్తింపలేక పోయితివి.

ఉ. అర్ణవసప్తకం బొకటియై ధర ముంగిన మిన్ను కుంగినన్
స్వర్ణ గిరీంద్రముం బగులువాఱిన లోకము క్రెల్లవాఱినం
బూర్ణ చయా సహాయుఁడయి పోరికి వచ్చి పురారి యల్గినం
గర్ణునిమేనఁ బ్రాణములు గల్గినఁ బార్థులచావు తప్పునే.

ధృత. నట్టూర్పు పుచ్చి జనాంతికముగా దేవీ! గాంధార రాజపుత్రీ!

గీ, కుంతికొడుకులు తుద కింత కూడొనంగ
బ్రతుకు మని వ్రాసెఁ గాఁబోలు బ్రహ్మ నొసట
బ్రతుక నీయఁడు వీఁడొక్క సుతునినేని
ముసలివాండ్రకుఁగేలూఁత యొసఁగుకొఱకు.
గాంధారి తొడపై మూర్ఛిల్లును

గాంధా : పైఁట కొంగుతో విసరుచు తండ్రీ! దుర్యోధన! కుమార! దుశ్శాసన! కుడువనా! ముడువనా! కాలము తీఱిద ముగుసలులకు మాకేమి కావలయు నురా? ఏమి చెప్పినను మీ బాగుకొఱకే గదా! మీ శుభోచ్చయముఁ జూచుచు నిఁకఁ గొన్ని దినంబులు బ్రతుకఁ దలఁచిన తల్లిదండ్రుల నేఁడే గతాసులఁ జేయుచున్నారా!

(ఏడ్చుచు మూర్ఛిల్లును)

విదు : సుయోధనా! నీవు విన వల్లి యొల్లఁగియు నుపదేశ పూర్వకంబుగాఁగ వామన స్తాపంబుఁగూడఁ గొంత యుపశమింపఁజేసికొనియెదను.

ఉ. తల్లికిఁ దండ్రికిం బ్రజకుఁ దప్పని తోఁచిఁ చేఁత సేయ నీ
యుల్లము తల్లడిల్లదు వయోభవ మైనదురాగ్రహంబునం
గల్లరిమూఁకమాట చెవిఁ గట్టుకొనం దగునయ్య? కమ్ములుం
బిల్లలుఁజల్లఁగా దగువివేకము జెప్పిన నేర వక్కటా!

పెద్దలమాట వినుట యట్లుంచి సభా ముఖంబునం గాంకార్య విచారంబు సేయునపుడు పెక్కుర కనుమతం బదుకార్యంబు చేయందగునని తొల్లి శుక్రాచార్యుఁడు చెప్పిన తెఱంగైనఁ బాటింపుము,

చ, భవదనువర్గమే కద! సహాసదు లందఱు కౌరి దక్కఁ, బాం
డవుల తెఱంగు నీ తెఱగు నల్వురకున్ విశదంబ కాన నిం
దెవరి తెఱ్ఱగు మఱచిదని యెక్కువమంది వచింతు రట్ల కా
దవు నని యొప్పి యచ్చటి సదస్యులు చెప్పినరీతిఁ జేయుమా

దానికి నంగీకరింతువేని సంఘ మఠణంబు తప్పుటయు. నీ మనోరథంబు సఫలవ బగుటయుఁ గూడఁ దటస్థించు. నింకొక విధానంబు చెప్పెద. తొల్లింటివారు పరస్పర కలహంబులు సంప్రాప్తించువెడ నిరు తెగల నుకడి యిరుపురు బలిష్ఠులకు దులారణంబు సమకూర్చి వారి జయాపజయంబులవే రెండు పీళ్ళ వారును జయాపజయంబులు నిర్ణయించుకొనుటయుఁ గలదు. కావున....

ఉ. వాసవితోడఁబోరఁగలవాఁడని కర్ణునియందు నీవు సే
రాస గలట్టివాడవు కదా! యిపు డిర్వురఁ బోరఁ జేసి యం
దోసరినట్టివానిఁ దెగ యోడినటు ల్మన మెంచుకొంటిమె
నీ సమరంబు మామ, జగమెల్లరకుం గడుసంతసంబగున్.

భీష్మ: దుర్యోధనా! విననేర్చితివేని యీ విదురుని పలుకులు లెస్సపలుకులు అందుం దులారణంబుమాట మిదులం గొనియాడఁదగినది. ఏమంటివేని---,

ఉ. కవ్వడితోడిపోరితము కర్ణున కిష్టము, వానిచేత నా
కవ్వడి నొవ్వఁజేసి రణకార్యము దీర్చుట నీ మనోరథం,
బివ్విరుసన్ ఫలించుఁ గద! యిర్వురకోరుకు; లెల్ల రాజులుం
జివ్వకుఁ బాసి సంతసముచే మని చూచెద రాలుబిడ్డలన్.

అది యట్లుండె నింకొక్కటి వినుము.

క. ఎన్నఁడు జన్మించితిమో
యెన్నఁడు పెరిఁగితిమొ యుద్ధ మేటికి? మా కో
యన్నా! ముదుసళ్ళము భగ
వన్నామముఁ దలఁచుకొనుచు బ్రదికెద మిర్విన్.

దుర్యో : శాంతనవా! ముదుసలివికాకపోయినను నీవు మాకు సహాయుఁడ వగుదు వనుకొంటిమా యేమి? తులారణంబునం బార్థమధ్య నుక్కడఁగించిన మాకుం బ్రయోజనం బేమి? నేఁడు రాజ్యమంతయుఁ గైవసంబు గా కుంటిమా?

ఉ. చచ్చినక్రీడి చచ్చినను జావనినల్వురు "మాకు నాలుగూ
ళ్ళిచ్చినఁ జాలు" నం చడుగరే? యపు డందఱు మీరు చెప్పరే ?
యిచ్చక మేల యాడె దపు డెల్లరుఁ జూడఁగ జూదమందుఁ గో
ల్పుచ్చిన భాగము న్మరల లోఁగొనఁ జూడరె నేఁడు వీరు లై ?

గీ. అయిదుగురు మాకు శత్రువు లంతె కాక
క్రీడి యొక్కఁ డొనర్చిన కీడు గలదె?
బ్రదికియుండిన నేగురు బ్రదుకవలయుఁ
జచ్చెనేనియు నేవురుఁ జావవలయు.

ద్రోణా : చిఱునవ్వు నవ్వి పెద్రివాఁడా! సుయోధన! తులారణంబున నంగరా జప్పుడే విజ్యచ్చు నోడించె ననియే యనుకొనుచున్నావా! అతని బల పరాక్రమములు నీ వే మెఱుంగుదువు ?

ఉ. పాశుపతంబుఁ జేకొనియె భర్గుని యు ద్ధములో నెదిర్చి, నా
కేశునిలోక మేగి యతఁ డెక్కినగద్దియ యెక్కె, సర్వభూ
మీశుల గెల్చి చేసెఁ బృథినీశ్వరు నగ్రజు నశ్వమేధి; నీ
కాశయ కాని యాలమున నర్జును దాఁకునె కర్ణుఁ డద్దిరా!.

గీ. విరటునిపశువులఁ బట్టిన
తరుణమ్మున నాతఁ డొకఁడు తాఁకిన మన యె
ల్లరగతి యే మయ్యెనో ! యే
తెరువున నడచితిమొ మఱచితే కురునాథా!

దుర్యో : ఆచార్యవర్య! సర్వజ్ఞులు మీరు సయిత మట్లే సెలవిచ్చిన నే నేమని
విన్నవింతును.

ఉ. పాండవపక్షపాతము భవన్మతము న్మఱలించెఁ గాక యా
ఖండలనందనుండు తమకంటెఁ బరాక్రమశాలియే! య ద
ట్లుండఁగ నెన్నఁడో యయిన యుద్ధముమాటఁ దలంతురయ్య? కా
నిండు మహాత్మ! మీకుఁ గృప యీగతివచ్చిన నేమి చేయుదున్ ?

భవాదృశులు పాండవులతో సంధి చేయు మనుటకంటె సర్వంబు వారి కొసంగి
మమ్మే యరణ్యంబునకు లేచి పొండనుట ధర్మము, అనుల్లంఘనీయం బగు మీ
యానతి చొప్పున సంధియే కావించితి నేని—

క. ఇరుగురు స్వతంత్రు లొకదేశ మేలఁ గలరె?
యతుకునే రెండు ముదిరిన యవనిజమ్ము?
బిముడునే రెండుకత్తు లెందేని నొక్క
యొఱను? నిమిడింపఁ జూచిన గురువరేణ్య!

ద్రోణా : గాంధారేయ ప్రథమ! ఏము పాండవులయెడఁ గాని మీ యెడలఁ గాని
భిన్నాభిప్రాయులము కాము. భీమార్జునుల బలంబు లెఱింగియున్నవార
మగుటచే నిట్లు చెప్పుచుంటిమి.

క. మదిసితిమి భోగముల, సం
పదలం గుడిచితివి మేము బ్రదుకఁదలఁచి యీ
కదనము వల దంచుం జె
ప్పెదమే ? పిఱిఁడివి గాక వీరమ్మన్యా !.

దుర్యో : సానునయముగా నంజలి బంధించి , ధనుర్నిగమసారావార పారీణ !
కుంభసంభవ !

శా. తల్లిందండ్రియుఁ దాత మీరు మొద లా క్షత్రశ్రేణియుం జెప్పుట
స్మల్లాభంబునకే, యెటుల్ రిపులతో సంధింతు సిగ్గేది; చా
వెల్లం బ్రాణుల కున్నదే యెటులనో యేవేళనో యెందొ! భీ
తిల్లం బాడియె ! మానహానియును గాదే ? చావు వి[illegible]త్తమా !.

క. చచ్చెదమో ! రిపువీరుల
వ్రచ్చెదమో! యెవ్వఁ డెఱుఁగు? రాఁదలఁచినచో
వచ్చి యని సేసి ధైర్యం
బెచ్చించుచుఁ బగఱ నొంచు మిదె ప్రార్థింతున్.

నమస్కరింపఁబోవును

కర్ణ : దుర్యోధనునిలాగుచు మిత్రమా! మిత్రుండ నగు నాకుఁగూడ లజ్జాకరం
బగుపని చేయుచున్నావు. బ్రాహ్మణుఁ డని కాని గురువని కాని నమస్క
రింతువు గాక!

మ. "అనికిం దోడ్పడు" మంచుఁ బాఱునొకనిం బ్రార్థింపఁగా వచ్చునే ?
కనకక్ష్మాధరధీర! రానిమ్ము సంగ్రామాంగణంబందు; నీ
యనుఁగుంగర్ణుఁడు చచ్చెనే! యిటుల దైన ం బంద నీకేల? యా
వెనుకన్ దైన్యము చెందెదో! రిపులతోఁ బెంపేది సంధింతువా ?

అశ్వ : అహంకారముతో ఓరీ! సూతచండాల! అట్లయిన నిదిగో నేఁడే చచ్చితి
విరా! మీదిఁ దుముకఁబోవును.

కృష్ణ : అడ్డుపడి ద్రోణాచార్యపుత్ర! త్రిదసేనానీవిమథామ! అశ్వత్థామ! కోపింప

కుము. రణచక్ర మంతయుఁ దనచేతిమీఁదనే త్రిప్పవలయు ననుకర్ణుని మనో
రథమే చెల్లింపుము.

శా. సేవాధర్మము సూతధర్మమును రాశీభూతమై యొప్ప వా
చావాత్సల్యముఁ జూపెఁ గర్ణుఁ డిటు మాత్సర్యంబు మీకేల? రా
జేవేళ న్మముఁ గోయనో! యనికి నాఁడే పొందు పోరాడ, లే
దా! వర్ణింపుఁడు కర్ణు చావువలుకో యద్యంతమో యుద్ధమున్.

కర్ణు : కృష్ణా! నివారింపకుము. రాని మ్మేమిచేయఁగలఁడో రూతము.

అశ్వ : కోపముతో) ఏమి చేయుదునా! యీ పిడికిలితో నీతల వేయి వ్రక్కలు
గావించెదను. కృష్ణుం దప్పించుకొనుచుఁ బైకురుకఁ బోవును.)

దుర్యో : వచ్చి పట్టుకొని తమ్ముఁడా! యేల యింత తొందర?

శా. కోపజ్వాల రగుల్చ(బోకుము దయాపారా! మాకెల్ల నీ
తాపాయం బగుత్ర వఁ బోవుము రణవ్యాసంగి వై కార్ముక
వ్యాపారంబు విరోధివర్గముల పైపైఁ జూపి చెండాడు మ
య్యా! పోరాటము పాడియే మనకు నన్యాయం బి టన్యోన్యమున్.

అశ్వ : కన్ను లింతలు చేసికొని) ఓయీ మూఢదుర్యోధన! ఇంకను. సిగ్గులేక
యనునయింప వచ్చితివా? చాలుఁ జాలు.

మ. అనికిం దో డగుమంచుఁ గోరఁ దగఁడే యాచార్యుఁ; డీసూతనం
దనుఁడా నీకు నియామకుండు? ధరణీనాథుండ వాచార్యపా
దవమస్కారముగూడఁ గూడ దనుచుం దా నీకు బోధించి మా
న్పిన మానం దగువాఁడ పే ఖలమతీ! విశ్వాసహీనా కృతీ!

ద్రోణా : కుమారా! ఏల రాజమూషణము? ఖలుఁడైనను రాజుం బరిత్యజించుట
తగవు గాని దూషించుట తగవు కాదు.

కృష్ణు : మహాత్మా! అట్లు పరిత్యజించుటమాత్రము ధర్మమా?

ద్రోణ : ఇట్టివాని పరిత్యజించిన నేమి పరిగ్రహించిన నేమి?

దుర్యోధనునితో హస్తిపుర సార్వభౌమ !

శా. చాలుం జాలును బేరు గూడ ధనురాచార్యాంక, మాలంబులో
నేలోపంబు ఘటించినం జెడుఁగదా! యీ పెద్దపే రంచు ని
ట్లాలోచించె నెపంబు సంగర పరిత్యాగంబు గావింప, జం
కేలా! పోరికి వీరు కోడుపడువారే యంచు నాశించితే ?

అశ్వ : దురహంకార పరివావిష్యమాణకురుకులరూపధేయ! రాధేయ !

శా. మీఱంబోకుము పొల్లుమాట. అనికి న్మీరాజు రండంచు మ
మ్మారాధించిననాఁడె వచ్చెదము లేరా !
(ద్రోణాచార్య కృపాచార్యులం జూచి తండ్రి! రావయ్య, మా
మా! రా పోదము, పోరికై! యెవరి నీక్ష్మాపాలుఁ డాసించెనో
వారే గెల్తురు వారి వారల జలావష్టంభము ల్చూచెదన్.

(దిగ్గన లేచి పోఁబోవును.

కృష్ణః కుతిభపౌత్ర! కృపాచార్యభాగినేయ! కించిత్కాల మోపిక చేయుము. అంద
ఱము పోవచ్చును. దుర్యోధనునితో బావా! నీకొల్వుకూటము క్రమముగా
రణకూట మగుచున్నది. పదుగురుండఁగనే నా చెప్పఁబోవు పల్కులు గూడ
నాలింపుము,

ఉ. చెల్లియొ చెల్లకో తమకుఁ జేసిన యెగ్గులు సైఁచిరందఱుం
దొల్లి గతించె, నేఁడు నను దూతగఁ బంపిరి సంధి సేయ, నీ
పిల్లలు పాపలుం బ్రజలు పెంపు వహింపగఁ బొందు సేసెదో!
యెల్లి రణంబు గూర్చెదవొ? యేర్పడఁ జెప్పుము కౌరవేశ్వరా!

చ. అలుగుటయే యెఱుంగని మహామహితాత్ముఁ డజాతశత్రుఁడే
యలిగిననాఁడు సాగరము లన్నియు నేకము గాకపోవు, క
ర్ణులు పదివేవురైన నని నొత్తురు చత్తురు రాజరాజ! నా
పలుకులు విశ్వసింపుము వివన్నుల లోకులఁగావు మెల్లరన్.

శా. జెండాపై కపిరాజు ముందు సితవాజిశ్రేణియుం గూర్చి నే
దండంబుంగొని తోలుస్యందనము మీఁద న్నారి సారించుచుం
గాండీవమ్ము ధరించి ఫల్గునుఁడు మూఁకం జెండుచున్నప్పు డొ
క్కండు న్నీ మొఱ నాలకింపఁడు కురుక్ష్మానాథ సందీఁపఁగన్.

శా. సంతోషంబున సంధి చేయుదురె? పక్షం బూడ్చుచో ద్రౌపదీ
కాంతం జూచిననాఁడు చేసిన ప్రతిజ్ఞల్ దీర్ప భీముండు నీ
పొంత న్నీసహజన్ము ఱొమ్ము రుధిరమ్ము ద్రావునాఁడైన, ని
శ్చింతం దద్గదయుం ద్వదూరుయుగమున్ ఛేదించునాఁడేనియన్.

దుర్యో: విననియట్లు నటించుచుఁదనలో నోటికి వచ్చినట్లెల్లఁ ప్రేలుచున్నాడు. ముందు వీనిమదమడఁచినం గాని యీ పాండవులమదమడఁగదు, ఇప్పుడే వీనికిం దగిన ప్రాయశ్చిత్త మొనర్చెదఁగాక.

భీష్మ: కుమారా! జగంబు లన్నిటికిని విశేషంబుగ మనకును జుట్టంబగు నీ యాదవ పట్టభద్రుని మాటలయిన మన్నింపుము.

క. విని చెడితివి మున్నీక
ర్ణుని పలుకులు బంధుజనులు నూఱుగు రున్నన్
వినక చెడుచుంటి రీవె
న్నని పలుకులు నేఁడు నీవు నూర్గురు తమ్ముల్.

దుర్యో: సాభ్యసూయముగా తాతా! మీ కందఱకుఁగర్ణునిపై నింత చూపేల ?

ఉ. బంధువు లైనవారుఁదిన వచ్చినవారును "పొందు సేయుమీ!
సంధి యొనర్పుమీ" యనుచు జంకి వచించుచు నుండఁగా దయా
బంధురుఁడై తదీయ మగు పద్ధతికిం దలచూపెఁ గాన నా
బంధువు కర్ణుఁడే యతనిపాటియె తక్కిన వేవురేనియున్,

క. నాతండ్రి పేరుగా దా
సీతనయుం డింతదనుకఁ జేసెఁ బ్రభుత్వం

వీతటి నాపేరుగ నీ
సూతతనూజాతుఁ దేలుఁ జూ(డి రాజ్యంబున్.

కృపా- కురునాథా! నీ రాజ్యమ్మును నీవు సూతతనూజాతునిచే నేలించుకొన్నను మఱి యొకనిచే నేలించుకొన్నను సమ్మతమే కాని. నీ వెంత రాజువైనను దిన వచ్చినవా రని యింత యెల్లిదముగా మాటలాడుకుము. నీ సౌమ్ము తిని యుండుటచేతఁగదా మావంటి వారి కిట్టి పోటుమాటలు తటస్థించినవి. కానీ యింకెన్ని నాళ్ళులే !

చ. కదనమువచ్చె దాఁపునకుఁ గాలము తీఱినవారికెల్ల ; నీ
మదిగలకోర్కి తీర్చుటకు మార్తుర దార్కొన కూర కీగతిం
బ్రదుకుము నిష్ఠురోక్తులకు బాలగువారమె? రాజపుత్ర! నీ
చదివిన విద్యకుం దగినచందము గంటిమి వేయు నేటికిన్.

యుద్ధ సన్నద్ధుండవై పదుగురు బలవంతుల సహాయము కోరవలసిన దానికి బదులుగ నీవనవలసిన మాటలేనా యివి ! బుద్ధి కర్మానుసారిణీ యనుచున్న విన్ననవేల ?

ఉ. చక్కని రాజవంశమున జన్మము నొందినవాఁడ వయ్యయో !
యెక్కడనుండి వచ్చె జగతీశ్వర! సూతునికొల్వు నీకు? నీ
యక్కఱ యేమి యంచుఁ జెడనాడుదువే? కులవృద్ధు భీష్ము: మా
దిక్కని వేఁడ కిట్లు చెడఁ దీసెదె? ద్రోణుని ద్రోణపుత్రకున్.

నార - కురుకుమార! యీ కృపాచార్యుల మాటలు నిరాకరింపవలసినవి కావు. నీ తండ్రి యంధుఁడగుటచే దాసీతనయుఁ డైనను స్వవిధముల లోకోత్తరుండైన విదురుఁడు రాజ్యమ్ము శాసించె, నిఁక నన్యుఁ డిప్పు డేల యేలవలసివచ్చును? వచ్చెఁబో !

క. ఉన్నారు:తమ్ము లాపై
నున్నారు మహానుభావు లుజ్జ్వలతేజుల్

మిన్నంటువారు పాండవు
లెన్నటికిని గర్ణుఁ దేలఁ డిభపుర మధిపా !

బహు శాపదగ్ధుండగు నీ కర్ణుని చెలిమికిం బ్రయోజనంబు భీష్మాదుల తోడి విరోధంబ కాని యొండు గాదు వీనికిం గలిగిన శాపములు వినుము.

గీ. మాఱువేసంబుతోడ బ్రాహ్మణుఁడ ననుచుఁ
శేరి యీ జమదగ్ని కుమారునొద్దఁ
జదివినట్టి దివ్యాస్త్రము ల్సమరమున స్ఫు
రింపఁ బోవని తుదను శపింపఁబడియె.

అదియునుగాక-

ఉ. చిన్నతనంబునం బ్రథమశిక్షగఁ దూపులవేఁత నేర్చుచుం
జిన్నపుటావుపై విడచి చంపిన దానిమహీసురుండు ని
ర్భిన్నమనస్కుఁడై యిటు శపించె "రణం బొనరించువేళ నీ
యున్నరథంబు క్రుంగఁబడు నోరి దురాత్మ; ధరిత్రిలోపలన్."

సహజంబులగు కవచకుండలంబు లున్నఁ దనకుమారున కజేయుఁడని కదా! త్రిలోకపతి యగు మా దేవేంద్రుఁడు కూడఁ బరప్రార్థనా దైన్యం బంగీకరించి వీనిం గోరలూడ్చిన పన్నగంబుఁ జేసినను వీని బలం బెఱుంగకున్నావు. ఇది యిట్లుండ నింకొకటి వినుము.

ఉ. అందఱు నాకుఁ జేరు కలహప్రియుఁ డందురు నిశ్చయంబుగాఁ
సందడి యన్న నాకుఁ గడుసంబర మెవ్వరికేని మీఁదికిం
గ్రిందికిఁ బెట్టి పోరు పొసఁగింపన చూచెద నట్టివాఁడ నీ
కుం దగదంటి నాపలుకుఁ గొంచెము నీమది విశ్వసింపుమా.

భీష్మ - తనలో అతఁ డంధుఁడు గాని యితఁడు మర్మదాంధుఁడు. ఇరు పురలో నతఁడే మెఱుఁగు. ప్రకాశము .

మ. అరయ న్నేరవు సంతః నాయడియ రాజ్యంబెల్ల! నే నొల్లమిన్
ధరకున్ బాండుడు నీదుతండ్రియును భర్తల్ నుమ్ము, నే నుండ సు
ర్వరకున్ మీరెవ? రేరు పాండవులు? వోరం గారణం బేమి? యి
ర్వరు నాసమ్మతికల్మి నేలుకొను టొప్పున్ మెప్పు వాటిల్లఁగన్.

విదు - పితామహా ! నీవేల యుపేక్షించెదవు ?

తే. గీ. చిత్రకారుని పగిది విచిత్రవీర్య
నందనుని నన్ను రాజ్యమ్మునందు నిల్పి
తీవు మును; పిప్డు బొమ్మన్న నేగువార
మంతియే కాని విన్నపం డడ్డఁగలఁడు.

క. ఈవు పితామహుఁడవు తా
నేవిధిని బితామహుండు సృష్టించి తగన్
బై వృద్ధి చేసి లయమున్
గావించునొ యట్లు మమ్ముఁ గడ కనుపఁ దగున్.

ద్రోణా - సుయోధనా! యిది వినుము.

శా. గాంగేయుం డెది చెప్పె నయ్యది తగన్ గై కోలు సేమంబు గూ
ర్చుల, గార్పణ్యము గాని వేఱొకట నీసుం గాని నా కుంతి యీ
సంగాతమ్మున కియ్యకొమ్మనఁ జూమీఁ సర్వమ్ము భీష్ముండె నా
కుం గూర్చెన్ మఱి జీవనమ్మునకు నేఁ గోర న్నినున్ బార్థుఁడున్.

క. ఇరు తెగయు వారు శిష్యులె
యిరుతెగకున్ గురుఁడ నేన యిం దెందును నా
కెరు సింత లేని దైనను
నరుఁ డశ్వత్థామవలెఁ గనం బడుఁ జూమ్మీ.

క. ఏ వనియు భీష్ముఁ డని వే
ఱే నీ వనుకొకు మాతఁ డెం దేనం

భూనాథ ధర్మ మెందేఁ
దా నిలుచునొ జయము నందె తప్పక నిలుచున్.

జమ - సుయోధనా! వృథా దురహంకారంబునం జెడకుము. యయాతియు గురుత్మంతుఁడును మున్నగు తొల్లింటి పెద్దలు చెడుట కిదియే ప్రథమకారణము.

క. కులవృద్ధగుగాంగేయునిఁ
గులగురు వగుద్రోణు నతనికొడుకుం గృపునిం
దలిదండ్రులఁ బరికింపక
బెళుచు లనఁగ నీకు నీవు పెద్దవె చెపుమా!

ఉ. మక్కువతోడ నిన్ను బతిమాలుచు నున్నకొలంది కర్ణుఁడే
దిక్కని వీరిపల్కులు మదిం జొరనీవు దురాత్మతంత్రతన్
వెక్కలి వింత యేమిటికి! భీష్ముఁడు పెట్టినభిక్ష గాదె నీ
కెక్కడిరాజ్య? మయ్యనఘుఁడే ధర యేలఁగ నమ్మతించినన్.

భీష్ముని దిక్కు మొగంబై భాగీరథీనందనా! ఈ భూమియంతయు నీది గాని యీ చెడుగులది కాదు.

ఉ. రోసితి వెల్ల నీ వని యెఱుంగుదు మైనను సుంతయేని వి
శ్వాసము లేని మోటకులపైఁ గరుణారస మేల? యేల వి
శ్వాసము నీకు! నీ మనసు వచ్చినవారి కొసంగు మయ్య! నీ
శాసన మౌను గా దనఁగఁ జాలినవాఁ డెవఁ డుర్విలోపలన్.

కర్ణు- నవ్వుచు జమదగ్ని మునిచంద్రమా! తపోనిష్ఠాగరిష్ఠులగు శుద్ధ శ్రోత్రియుల కీరాజకార్య ప్రసంగ మేల? అంబాంబాల్యంబిక లను మువ్వురు రాచకన్నియలం దెచ్చి యం దిరువుర విచిత్రవీర్యునకుం బెండ్లి చేసి యంబ నుభయభ్రష్టురాలిం జేసిననపుంసకునకు రాజ్యమెక్కడిదికిది? ఏదీ! మనసువచ్చినవారి కిప్పింపుము.

ఉ. వచ్చినవాడు వచ్చె బలవంతముగా ననిఁ బంచపాండవుల్
చచ్చినదాఁకఁ గర్ణుని బ్రచారము పో, దిపు డెవ్వ రేమి వా
క్రుచ్చిన రాజరాజు గయికోఁడు నిజం బెవ రెంతమాట రా
నిచ్చినఁ గొంగు పట్టితి మునీశ్వరులార! బహూక్తు లేటికిన్.

జమ : ఓరీ జాలికా! శుద్ధశ్రోత్రియులమా? ఇపుడు మా పరశురాముఁ డిక్కడనున్న మా శుద్ధశ్రోత్రియత్వము కనఁబడునురా!

భీష్మ : స్వామీ! సైరింపుఁడు. మీ కుమారుఁ డిట లేఁ డన లేల? యీశిష్యపరమాణు వెవరు? అయినను నికృష్టులతోఁ బ్రసంగించుట తగదనియే కదా! యేను మిన్నకుంటిని.

జాబా : రథకారకులీన! ఎవ రెంతమాట రానిచ్చినఁ గొంగు పట్టితివిగా! ఇదిగో రానిచ్చుచున్నాను.

ఉ. ఒక్కనిఁ జంపు మంచుఁ బురుహూతుఁ డొసంగినశక్తి ఫల్గునుం
డొక్కఁడుఁదక్కఁ దక్కుఁగల యోధుల నొక్కనిఁ జంపుఁగా కతం
డెక్కటి ఖాండవంబు దహియించుచు నున్నపు డొక్కనాగు నీ
దిక్కున డాఁగెనే! యది యదృష్టముచే గురి తప్పు గావుతన్!

కర్ణు : తనలో ఆకటా! ఈ ముసలి జడదారి శాపవచనముచే విజయ విజయ సాధకంబు లైన నా సాధనంబులు రెండును వ్యర్థము లగుం గాఁబోలును! ఆలోచించి ఒరులపైఁ బక్షపాతమునఁ గనిసి పలికినని ఋషి వాక్యము లైనను బాటి తప్పకమానవు. ప్రకాశముగా నిర్లక్ష్యముగా దుర్యోధనునితో మిత్రమా! యీ ఋషి యిట్లు పలికె నని బెదరుచుంటివా యేమి! పిన్ననాఁట నుండియు నిట్టితిట్లనేకములు వడితిని. అవి యన్నియు నిజము లైనచో నే నిదివఱకే లేకుందును.

దుర్యో : వినయముతో మునీంద్రులార! మీకు మే మేమియపకార మొనరించితిమి?

ఉ. బాలి వృత్తి మీ జపతపంబులు పాడొనరింపలేదు, మీ
జోలియుఁ గాని మీ ఋషుల జోలియుఁ గాని తలంపలేదు, మీ
కేల దురాగ్రహంబు? నృపులెల్లరకున్ భువి ధర్మ మైనమా
యాలములోన మిమ్ముఁ దగ వాడఁగ రండని పిల్చినారమే!.

దుశ్శా : జనాంతికము సహోదరా! యీ ఋషు లందఱు నూరక దురాగ్రహం
బున శపింప మొదలిడినారు. భీష్మాదు లందఱుఁ బాండవ పక్షపాతమున
ధర్మాధర్మములు తలంపక మాటలాడుచున్నారు. వీరందఱును దమమాట
విననిచో నిన్నుం గృష్ణున కొప్పగించవలెనని తలఁచుచున్నట్లు నాకు
నూహింపనయ్యెడి.

ఉ. ఒప్పరికింప కిప్పగిది నొప్పులొ తప్పులొ పల్కి వీరు నీ
యొప్పమిఁ జేయఁగాఁ దలఁచి యుండిరి; కావున నీవు కొల్వులోఁ
దప్పినఁ దప్ప కీర్వ్యడుట తప్పదు నాపలు కాలకింపుమా !
యిప్పుడ లేచిపోదము మహీపతి మూర్ఛ తొలంగకుండఁగన్.

దుర్యో : తనలో బళిరా! తమ్ముఁడ! సమయానుకూలమగు నుపదేశము నొనర్చి
తివి.

కర్ణ దుశ్శాసనాదులతో నిష్క్రమించును.

ధృత : మూర్ఛదేఱి యాత్రముతో ఓరీ దురాత్మ! నే నేమనుకొంటినో యంత
పనియుఁ జేసితివిరా! (గజగజ వడంకుచున్నాఁడు.

విదు : మహారాజా! ఏల భయపడుచున్నావు? మతేమియు నత్యాహితము రాలేదు.
మన దుర్యోధనుఁడు సభాసదులు వచించుమాటలు వినఁజాలక కొలువులో
నుండి లేచిపోయెను.

ధృత : అంతియకద! నిజముగాఁ జెప్పుము, దుర్యోధన దుశ్శాసన కర్ణ శకునులు
నల్వురుం గలసి పరాత్పరుం డగు శ్రీకృష్ణుని మహత్త్వ మెఱుంగక యతని
బంధింపఁ దలంచినట్లును నతండు తన విశ్వరూపముఁ జూపించినట్లు నొక
స్వప్నముం గంటిని.

విదు : అది యింతవఱకు జరగలేదు. ముం దేమగునో? ఒక్కొకప్పుడు స్వప్న ములు భావికార్యమును సూచించుచుండును.

కృష్ణు : మామా! విచారింపకుము. అట్టిపని యేల జరుగును? జరుగుఁగాక! నాకేమి భయము?

గీ. వినిన వినవచ్చు వినకున్న వినకపోవ
వచ్చుఁ గా కిస్సిరో! మనవాఁడు కొల్వు
వెడలిపోవునె యారీతి వెఱ్ఱి యగుచు
ననుచు వగచుచునుంటి ధరాధినాథ!

గాంధా : మూర్ఛదేలితి నాథా! యేమి యీకోలాహలము?

ధృత : దేవీ! నీ కొడుకు చేసిన వేఁదురుపని.

భీష్మ : ఆంబికేయ! గడచినదానికి వగచినఁ బని లేదు. కలియుగము ప్రవేశించినది. యుద్ధంబు కాక మానదు.

ధృత : దేవీ! నీ వొకసారి మరల సుయోధనుని రప్పించి చెప్పిన వినునేమో ?

గాంధా : మహారాజ! మొదటినుండియు దురాత్ముండగు వానికి రాజ్యమిచ్చిన దానికిఁ దగినఫల మనుభవింపఁ బోవుచున్నారము, వానిదుష్టచేష్టలకు మనమే కారణము, రాజ్యప్రదానము సులభముగాని దుష్ట కార్యనివర్తనము కష్టము గదా! పలువుర పరిహాసమునకుఁ బాత్రులమైతిమి! అయినను నాయోపినకొలదిఁ జెప్పెద.

ధృత : విదురునితో నీ వేగి మీయమ్మ పిలుచుచున్నదని సుయోధనునిం దోడ్కొని రమ్ము.

విదు : చిత్తము పోయి దుర్యోధనునితోఁ బ్రవేశించుచున్నాఁడు

దుర్యో : వచ్చి తల్లీ! నమస్కారము. నన్నుఁ బిలిపించిన పనియేమి ?

గాంధా : తండ్రీ! దుర్యోధన! సహానుజుఁడ వగునీకు శ్రేయస్కరం బగు నీ తండ్రి మాటలు వినుము. గాంగేయ కుంభసంభవ కృపాచార్య విదురాదులు నీ

మము కోరని వారు కారు. ఐశ్వర్య మదృష్టమూలము గాని బుద్ధిసాధ్యంబు
దు. జితేంద్రియుండును మేధావియుఁ గానివానికిఁ బ్రజాపరిపాలనము సుకరంబు
దు. నీకుఁ గామక్రోధములు శత్రువులు గాని పాండవులని తలంపకుము.
ఎదట నీ వారికే యిష్టుండవు గానిచో రిపుల కెట్లసాధ్యుండ వగుదువు? కన్నులు
గిన వలలోఁ జేఁపలు చిక్కనివగిదిఁ గామక్రోధములచేఁ దూంట్లు పడిన
హీపతి వలలో శత్రువులు చిక్కరు. కావున రిపుషట్కంబు జయించి రిపు
ంచకం బనితలంచుచున్న పాండవులతోఁ గలసి నీ రాజ్యము సుఖముగాఁ
ిలించుకొనుము. కుటుంబకలహమునకు జంకి కదా మీ తాతయుఁ దండ్రియు
ాలిభాగము వారికీయఁ దలంచిరి? నిష్కంటకముగఁ బృథివియంతయు నే
ఁదలఁచితివేని వారడిగిన ట్లయిదూండ్లయినవారికిమ్ము నా యుపదేశము పిష్ట
పేషణప్రాయ మని యెఱింగియుఁ గన్నకడుపు గావున మరలఁ జెప్పుచుంటిని.
యందును బాండవులయందును సమప్రీతిగల శాంతనవాదులు తమ యావ
చ్ఛక్తితో సమర మొనర్పకుండుటయే నిక్కము కాన బంధుమరణంబున కొడి
ట్టకుము.

దుర్యో— తల్లీ! ఐశ్వర్యం బదృష్టసాధ్యంబయి మరణము మాత్రము బుద్ధిసాధ్య మగునా!

ఉ. పాండవులైన నుండవలె భారతవంశము నిల్ప, లేక మే
ముండవలెం; ద్వితీయసహితో కి నిక్కము మాఱు పల్కకు
బుండఁ గుటుంబనాశకుఁడ ధూర్తుఁడఁ బుట్టితి సైఁపు మమ్మరో!
ఖండన మాచరింతు బలవంతపుదీవన యిచ్చి పంపుమా.

విదు - మహారాజ! విచిత్రవీర్యనందన!

గీ. సభ్యులకు నెల్ల సెల విచ్చి సరసిజాక్షు
నంపకము చేసి నిజగృహాభ్యంతరంబు

నకుఁ జనుఁడు భావికార్యంబునకు వగనుచుఁ
దొలఁగి చనె రాజు క్రమ్మఱఁ గొలువునుండి.

ధృత— నాయనా ! జనార్దనా ! దగ్గఱకు రమ్ము. (కౌఁగిలించుకొని

క. సుతుల నొకనూటుగురఁ గాం
చితి జగముల సీడు లేని సిరి పెంచితి యే
గతి కానున్నదొ ! మాకుం
జితివిధి పాండవులచేతఁ జేయించెదవే !.

చ. కడుపెఁడుబిడ్డలం గనియుఁ గాలము తీఱిన వార్ధకంబునం
గొడుకుల నెల్లఁ బాసి తమకొంపకుఁ గూటికిఁ జేరు బన్న మే
ర్పడినను బ్రాణగొడ్డములు పల్కఁక మాదెనఁ గీడు గొంతితోఁ
గొడుకులతో సహింపు మని కోరితి నంచు వచింపుమా హరీ !.

కృష్ణ—మామా! అట్లనఁబోకుము. నీ కొడుకులు మాత్రము బలహీనులా'
కుంతికే నీ యింటికిఁ బొట్టకూటికయి వచ్చునవస్థ తటస్థించునేమో ?

మ. గెలువ న్శక్యమె? కర్ణుఁ డేమి భుజశక్తిం జూడ సామాన్యుఁడే ?
బలవంతు ల్గురుఁ డాపగాతనయుఁ డశ్వత్థామ మున్నైన యో
ధులు నీపుత్రున కాజిఁ దోడ్పడక యెందుం బోదురే ! యాఁగినం
గల నాపింపఁగ జూచి రిందనుక పక్షంబున్న చందంబునన్.

ధృత—వాసుదేవ! చక్రధారివగు నీవు చక్రరక్షకుండవై యుండు బాం
వుల కేమి కొదవ ?

చ. సవసవగా శరంబులను జార్చెద రంతియ కాని వీరిలో
నెవరికిఁ జేతు లాడు వధియింపఁగఁ బార్థుల? వారిలోనఁ గౌ
రవశతకంబు ఘోరసమరంబునఁ జిక్కఁనఁ జంపకుండఁగా
నెవరు పరిత్యజించి దయయెంతురు? చెప్పుము నాకుఁ గేశవా !.

ష్ణ—

శా. లేదా! యింత వివాద మేల? యిచటన్ లేరా? మహాప్రాజ్ఞుల
య్యో! దుర్యోధనుఁ డింత దుష్టుఁడగునే? యోగ్యేతరుల్వోలె మీ
రీదుశ్శాసను శాసనంబు గొనఁగా నేమంత వచ్చెన్? విడన్
రాదో! చంపఁగ రాదో! దుర్మదుని నిర్మర్యాదు లోకార్థమై.

ర్మ—(జనాంతికము వాసుదేవా!

ఉ. చెప్పితి నీవు మే మురక చెప్పితి మేమి యొనర్తు మింక? వా
తప్పులకుప్ప తేఁడు మన దారికి రాక తొలంగె, వానికే
త్రిప్పలు లేవు, సంధి యొనరింపమిచే మనబోటి వారికి
న్ముప్పు ఘటించె నీచెడుగు మూలముగా యదువీర! నేఁటికిన్.

అయినను గాలగతికిఁ దప్పువారమె! కుప్పకూరలుగ రణశకునంబు లుప్ప
గ్గుచున్నవి. మాకు సెలవిమ్ము. ధర్మము దప్పకుండఁ గర్ణధారుఁడవై యీయొడ
పింపుము.

సాత్య—(తత్తఱపాటుతో నిష్క్రమించి ప్రవేశించి కృష్ణునితో జనాం
కము అన్నా! ఇంతకుమున్ను దుర్యోధనాదులు చేసిన దురాలోచనమును నేను
పెట్టితిని. నీవు జాగరూకుండవై యుండవలయు. ని న్నీసభ నురుఁగకుండఁ
ట్టుకొని బంధింపవలయునని యోజించుచున్నారు. (చేత జూఁపి అందులకు
చకముగా నదిగో! సుయోధనునియొద్ద నొకరజ్జు వున్నది కనుఁగొనుము.

కృష్ణ— (అలక్ష్యభావముతో తమ్ముఁడా! అవుఁగాక, నన్ను వీ రేమి
పం జేయఁజాలరు. సంశయింపకుము.

సాత్య—అన్నా! అట్లని యుప్పరికింపం జనదు.

ఉ. ఐ నొకరుండఁ జాలఁ గల నిచ్చటి దుష్టులకెల్ల; నింకఁ బై
పై నరుదెంచు సేనఁ గృతవర్మ వధింపఁగలాఁడు ద్వారమం;

దానరసింహులతోడ నిది యంతయుఁ జెప్పితి నందు నిల్పితిన్
వీని వధించి నేఁడె పృథివిన్ మనపార్థుల కిత్తు మగ్రజా!.

దీనికి భీష్మ ద్రోణ కృప పాశ్వత్థామలును సమ్మతించువారే. ఇందుల కేమందువు?

అంతఁ గర్ణ శకుని దుశ్శాసనులు పగ్గములు చేతఁబట్టుకొని వేఱువేఱు దిక్కులనుండి ప్రవేశింతురు.

కృష్ణు: మన మిప్పుడు వీరిని వధింప రాదు. దానికిం గతము సావకాశంబుగా వచించెద. నీ వూరక చూచుచుందుము. వీరలెల్లరు పటా పంచాలై పోవున ట్లొనరించెద.

సాత్య: (సన్నద్ధుఁడై యుండును.

కృష్ణు: (తేటిపాటుఁజూచి తనలో) ఔరా! చేటుకాలము! ఈ ధార్తరాష్ట్రాగ్రజుండు మున్ను తా నన్ను దుస్తంత్రమెల్ల నడిపించుచున్నాఁడు. కానిమ్ము. ఎవఁ డ్రవ్వుకొన్న గోతిలో వాఁడే పడుఁగాక!

క. పదిలక్షలు కర్ణులు తోం
బదిలక్షలు శకునులును నృపాలకు లొకయ
ర్భుదముం గవిసినఁ గృష్ణుని
పదరేణువ చాలు లీలఁ బరిమార్పంగన్.

సాత్య: (సంరంభముతో ఓ విదుర గాంగేయాది నీతిధురంధరులారా! ఇది వినుఁడు.

చ. అదె కనుఁగొండు దుర్మదు లహంకృతిశాలులు కౌరవుల్ సుదు
ర్మదు లయి యగ్గిపై నుఱికి మ్రగ్గెడి కీటము లట్లు లన్నఁ "బ
ట్టుద" మని యెంచి పొంచుచుఁ గడుంగడు నక్కుచున్నవారు చ
చ్చెద రిదె మీరలెల్లరు "నిసీ!" యనిరోయుచుఁజూచుచుండఁగన్.

దుర్యోధనాదులు వేఱ్ఱువేఱుగా నిష్క్రమింతురు.

విదు : అదరిపడిచూచి అన్నా! చిత్రవీర్య!

మ. శిశుపాలాంతకుఁ గంసమర్దను ద్విషత్సింహున్ మహారంహు దు
ర్దశపాల్గాఁగఁ దలఁచి నీసుతులు గాంధారేంద్రుతోఁ గూడి స
ద శునిన్ గట్టఁ గడంగినారు, నిలయం బై పోపు నీవాఁడె యా.

ధృత: (నిశ్చేష్టుఁడై యుండును.)

కృష్ణ: (భీష్మనిదిక్కై) తాతా! మరున్న దీవందన!

శా. నాపైఁ గోపముఁ బూని నీమనుమ లున్మాదంబుమై వచ్చినా
టోపం బెంతయు నొప్పఁగాక ననుఁ గట్టుంగాక రారాజు; మే
లే! పోని మ్మొకసుంతయాజ్ఞ యిడు మీ, వీగోపబాలుండు దా
నాపన్నుం డగునో! పతేమగునా! యాద్యంతంబు నీక్షింపుమా!.

ధృత: (తత్తఱపాటుతో తమ్ముఁడా! తత్క్షణము నీ పరిగి యయ్యవినీ తులనెల్ల
నిక్కడికిన్ దీసికొనిరమ్ము.

విదు : (నిష్క్రమించి దుర్యోధనాదిసహితుఁడై ప్రవేశించుచు.

ధృత: కుమారా ! యేమి యీదుర్నయము.

మ. అనుజుల్ నీవునుఁ గూడి చావఁగఁ దలం పావిర్భవం బందెనే?
దనుజారాతి నెఱుంగమే? యతనిపై దర్పంబు ఘటించెదే?
చెనఁటీ! యెక్కడిదుండగం బిది! యశశ్శ్రీప్రాణమానావహం
బనఘాత్ముం డతఁ డగ్గెనేని భువనం బల్లాడి చల్లాఱదే?.

విదు : గాంధారేయప్రథమ! నామాట కొంత యోజింపుము.

క. ఎంద తెదుర్కొని యేగతి
నందిరి? శ్రీకృష్ణుఁ డనఁగ నందటితో నె
న్నం దగుమనుజుఁడె? చెడిపో
పం దల్ప పూనకుము గోడుపడకుము వృథగా.

కృష్ణ: దరహాసముతో) బావా! ధార్తరాష్ట్రరాజ! యిటు చూడుము.

ఉ. ఒక్కనిఁ జేసి నన్నిచట నుక్కడఁగింపఁ దలంచినావె? నే
నెక్కడఁ బోఁ గలాఁడ? నిఁక నిక్కడఁ జిక్కితిఁ బిక్కటైవడిన్
దక్కితి నీకుఁ, బట్టు మొగిఁ దక్కకు, మిట్టిటు చేరరమ్ము, బల్,
చక్కనియూహ పుట్టె, ననుజన్ములతో నరుదెమ్ము పార్థివా!.

(అట్టహాస మొనర్చును.

దుర్యోధనాదులు కృష్ణునివంకఁ జూడలేక కనులు మూసికొని యతి భయముతో గడగడ వణఁకుదురు.

కృష్ణ: ఆ. వె. దివ్యదృష్టి యొసంగితిఁ దేఱిపాఱఁ
జూడుఁ డనఘాత్ములైన సంశుద్ధులెల్ల
నిది నిజమ్ము నిజాకృతి యిడియ ముక్తి
దము తపశ్శాలులకును వదాన్యులకును.

మునులును భీష్మవిదురద్రోణులును నానంద పారవశ్యము నటింతురు.

ధృత: (తనలో) శ్రీహరి తననిజరూపంబు ప్రదర్శించెం బోలు! అక్కటా! యీ పాపాత్మున కిది దర్శింపరాదు గదా! ఆయనను నడిగి చూచెదఁగాక! (ప్రకాశము)

క. దేవా! దేవరయడుగులు
భావించి కనుంగొనంగ వాంఛించెద నీ
సేవకుండ నాకు దర్శన
మీవే! యీవేడ్క దొరకు టీవేళఁ గదే!.

కృష్ణ: నీకును దివ్యదృష్టి యొసంగితిని కనుఁగొనుము.
ధృత: (తేఱిపాఱఁ జూచి)

చ. ఒకట నజుండు నొక్కయెడ నుగ్రుఁ డొకంటను విష్ణుఁ డొక్కెడన్
సకలసురుల్ మఱొక్కయెడఁ జంద్రదినేంద్రులు వేఱొకంట భూ

పతుల మొకంట యాదవులుఁ బాండవులున్ గనుపట్టుచున్నవా
రకట! యిదేమి చోద్యమిట; యద్భుత మీతనూరూప మియ్యెడన్.
(అంజలి ఘటించి) దేవా! విశ్వరూప!

మ. విలయాగ్నిప్రభ లెల్లెడన్ వెలిఁగెడిన్ విశ్వేశ! విశ్వాత్మ; యే
వెలుఁగుల్ దీనికి దీటుగాఁదగ వహో! వీక్షింపఁగా నేర రీ
వెలుఁగున్ సర్వసుపర్వధూర్వహులు, పృథ్వీభారనిర్వాహ! మ
మ్ముల సైరింపఁగదయ్య! దుష్టమతులన్ మూఢాత్ములన్ గేశవా!

ఆశ్చర్యముతోఁ దనలో) ఏమీ! వాసుదేవుండు నా ప్రార్థనము మన్నించి సర్వలోకభీషణం బగు తన విశ్వరూపము మనసంహరించినాఁడే. (నలుదెసలు పరికించి ఈ మహామహు నీక్షించిన యీ దృష్టితోఁ బాపపుఁబ్రపంచ మేల చూడవలెను. (ప్రకాశము) వాసుదేవా! మహానుభావ!

మ. ద్రుహిణాదుల్ గనలేని నీదయినచిద్రూపంబు గన్గొంటి నే
బహు పాపాత్మకుఁడై నపుత్రుకతనన్; భావత్క మౌరూపమున్
రహి నీక్షించినకన్నులన్ బరుల నర్హం బౌనె వీక్షింప? నీ
వ హరింపన్ గదవయ్య! నీ విడిన దివ్యజ్ఞానమున్ గేశవా!

కృష్ణు: మామా! నీ వెట్లభిలషించితివో యట్లే యయ్యెడుఁగాక! భీష్మాదుల దిక్కై.

శా. మేలున్ గీడును జెప్పి చూచితిరి మీర్మీయథాశక్తి, తేఁ
దాలంబందె కుతూహలంబు గలవాఁడై యుండె, ముమ్మాటికిన్
గాలుం దాఁకొనియుండఁబోలు! నెవ రాఁగన్ జాలువా రింక? నా
కేలా యిచ్చట జాల? మాజ్ఞ యిడుఁడా! యిందున్నవారెల్లరున్.

(లేచును.)

(భీష్మాదులు వెంబడిని లేచి నిల్తురు.)

కృష్ణు: ప్రయాణోన్ముఖుఁడై కొంతవడికు నడుచును.

దుర్యో : (సాగనంపుచు నిష్క్రమింతురు.)

కృష్ణ : (భీష్మద్రోణుల దిక్కై) నాకు ననుజ్ఞ యిండు.

భీష్మ : మంచిది. నాకీవిచారము మాత్రము బాధించుచున్నది.

క. గురులకు భక్తుఁడు శాంతుఁడు
నరుఁడు నిరతసత్యవాది నానాసుగుణ
స్ఫురణుండు వానితోడన్
దుర మొనరుచురన్న నొండు దుఃఖము కలదే ?

ద్రోణు : వాసుదేవా !

ఉ. నాకరుణావిశేషము ధనంజయునిన్ బొనరించె నర్వ్పలో
కైకధనుష్మదగణిగ, నర్జునుతో నెపఁడేని జాలఁ, డ
ప్రాకృతమూర్తి శాంతమతి వానియెడన్ ప్రియ మగ్గలంబు సూ!
నాకామరుండు గాఁడటులు నాకుఁ ప్రియుం డెటుసేతునాలమున్ ?

కృష్ణ : ఏమిచేయుదుము. ఆతనికిని నిదియె సంశయము. కాలముని వార్యము.

భీష్మ, ద్రోణులు (నిష్క్రమింతురు.

కృష్ణ : (పరిక్రమించి నలుదెసలు పరికించి తేనిని నగరివలకంప కర్ణుఁడు తన
యవసథమునకు నేగుచున్నాఁడు కావున నితనితో మాటలాడుట కిదియే
తగిన సమయము.

కర్ణ : (ప్రవేశించును.

కృష్ణ : (కర్ణుని జేసన్నచేఁ బిలిచి) రాధేయ! ఏకతంబుగ ముహూర్త మాత్రంబు
నీతో మాటలాడ నాకవకాశ మొసంగుదువే!

గీ. ఎల్లి సూర్యోదయంబున నేగువాఁడ
నిట వసించెద విదురునియింట మాపు

తే॥ ఇటకు వత్తువో! వేఱ యింటి కేను
వత్తునో! యాన తీఁగదవయ్య కర్ణ!.

కర్ణ:- (తనలో ఇతఁడు నా జననరహస్యముంగూర్చి మాటలాడెఁడు. (ప్రకాశము తప్పక నీవరుగు సమయమునకు వచ్చి దర్శించెదను.

కృష్ణ- మంచిది. (ఉభయులును నిష్క్రమింతురు).

గద్య.

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వరులచే రచియిం
బడిన పాండవోద్యోగమునందు
ద్వితీయాంకము.

.... ० ....

శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవోద్యోగము

నాటకము

## చతుర్థాంకము

కుంతియుఁ గృష్ణుఁడును బ్రవేశింతురు.

కృష్ణ: అత్తా! ఇఁక నాకు సెలవిమ్ము. కౌరవ సభావిశేషము లన్నియు వినితి
గదా!

చ. బవరము దాయపిచ్చెఁ గురువంశ మడంగుట నిశ్చయంబు, పా
ండవబలమే జయించు నన నావశమా! గురుఁడాది యైనయో
ధవరులతో నెదుర్కొన సుధాకరశేఖరుఁ డైనఁ జాలఁడా
హవ మొనరింపఁగా వలయునా? వలదా? వివరించి తెల్పుమా!

గీ. కొడుకుకొడుకులఁ గోడండ్రఁ గొడుకు లీవుఁ
గూడికొని పోయి వెనుగొండగుహలలోన
దాఁగి యుండుఁడు బ్రదుకఁగాఁ దలఁతురేని
బ్రతికియుండినఁ దినవచ్చు బలుసుఁగూర.

కుంతి: దేవకీనందన! నీతల్లి చతురిమయంతయుఁ జూపించుచుంటివి. నా మ
గతం బెఱుఁగఁ దలఁచి కాని నీ వెఱుఁగవే? కొండగుహలలో
యుందురో! ప్రాసాదమందిరంబులలోనే యుందురో! సుక్షత్రి
లనిపించుకొనుటయే నాతలంపు. కుంతిభోజునకు దత్తపుత్రి నై చతురుద

వేలావలయితం బగు ధరామండలం బేలిన పాండు భూ॰॰లునకుం బత్ని..
బలవంతు లని పేరుగాంచిన యేగురుకొడుకులకుఁ దల్లినై దాయాదుల
యింటఁ బదుమూఁడేడులు కుడుచుచు బ్రదికియుండుటకంటె వనంబులలో
నుండుట తక్కువ గాదు. అయినను నిర్భాగ్యురాం(డకుం దార్కాణగాఁ
గుంతి నొనర్పవల దనియు గార్యాలోచనంబుపట్లఁ బాంచాలిని గారవింప
వలసినదనియు ధర్మరాజుతో నొక్కివక్కాణించి నే నింతకుమున్ను
వచించినవిదులాసంవాదం బెల్ల బోధించి యెవనిజన్మము శాత్రవగర్వ
నిర్వాపణా సమర్థమో అట్టి పుత్రునిగన్నతల్లి యొకతల్లిగా దని
నే నన్నట్లుపదేశింపుము.

(కృష్ణ: మంచిది నీవు నిలుపుము.

(కుంతి: నిష్క్రమించును.)

కృష్ణ: పరిక్రమించి) ఏమీ! కర్ణుఁడు రాఁడయ్యెనే?

తే. గీ. అన్నమాటకుఁ దప్పఁ డెన్నైన వచ్చి
తీరవలెఁ గాని వేరొండుతీరు గాదు

ఎదుటఁజూచి

సూర్యుఁ డుదయించె నదిగో! తత్సుతుఁడు కర్ణుఁ
డరుగుదెంచెడిఁ దాను మున్నన్నపగిది.

కర్ణు: ప్రవేశించును.

కృష్ణ: కర్ణునిం దనచేతులతో దగ్గఱకుఁ దీసికొని బావా! నీ కొక పరమ
రహస్యంబు వినిచెద సావధానముగ వినియెదవా?

కర్ణ: (చిఱునవ్వుతో) నీసంబోధనమువల్లనే తెలియుచున్నది. అయినన్ను
చెల్పుము.

కృష్ణు: తే. గీ. కన్నె ప్రాయంబునందు భాస్కరుని కరుణఁ
బదినెలలు మోసి నినుఁ గన్నపడఁతి కుంతి
చేరఁగాఁ దీసి నిన్నుఁ బెంచినది రాధ
నీవు రాధేయుఁడవు గావు నిశ్చయముగ.

నీ వెఱుంగని ధర్మశాస్త్రంబులు లేవు. కానీనునకును సహోఢునకును ... పెండ్లియాడినవాఁడె తండ్రి యని చెప్పుదురు. కావున ధర్మరాజాదులవలె ... పాండవుఁడవే. దుర్యోధనుఁడు సంధి కొడంబడఁ డని యెఱింగియు నీయుదంతంబుఁ దెల్పి నిన్నుం దోడ్కొని పోఁదలంచుటయే నారాకకుఁ బ్రథమ కారణము.

ఉ. అంచితులైనబందుగుల యందఱిముందఱఁ జెప్పి నిన్ను మె
చ్చించెదఁ, గుంతిచేత రవిచేత నిజం బని నీకు సాక్ష్య మి
ప్పించెద, ఫల్గునప్రముఖవీరులు గొల్వఁగ నెల్లభూమి యే
లించెద నచ్ఛకీర్తి విమలీకృత సర్వదిగంతరంబుగన్.

గీ. మాతృపక్షము మేమెల్ల మమ్ముఁ జూడు
మనఘ ! పితృపక్షము యుధిష్ఠిరాదులెల్ల
వారిఁ జూడుము నావెంట వారికడకు
రమ్ము మీయమ్మ యలర రాజ్యమ్ము గొమ్ము.

మఱియు నీకు ధౌమ్యులు వేదోక్తంబుగఁ బట్టాభిషేకంబు నెఱపున ట్లొనరించెద.

చ. వ్యజనంబున్ ధరియించు ధర్మజుఁడు, దీవ్యచ్ఛత్రముం బట్టు వా
యుజుఁ, డశ్వంబులఁ దోలుఁ బార్థుఁ, డభిమన్యుం డంకమందుండు, భూ
ప్రజలెల్లన్ జయపెట్ట నీకు జరుగున్ బట్టాభిషేకంబు, భా
నుజ! మాద్రేయులు ద్రౌపదేయులును నేనున్ యాదవుల్వెంటరాన్.

ఇదియును గాక యొక్క విశేషంబు చెప్పెద నాలకింపుము.

ఉ. ఏసతి వహ్నిలోన జనియించెను జన్న మొనర్చువేళ, ము
న్నేసతిపెండ్లినాఁడు నృపులెల్లఁ బరాజితులైరి క్రీడిచే,

నేసతిమీఁదిమోహమున నింతలు చేసిరి రాజు నీ ;; ని
న్నాసతి పెండ్లియాడఁ గల దాఱవభర్తగ సూర్యనందనా!.

క :- వసుదేవకుమారా! నా యందలి సౌహార్ధంబున శ్రేయస్కామివై తెలిపిన ... రహస్యము నా సహజ కవచకుండలంబు లింద్రున కిచ్చు నాఁడు సూర్యుని వలననే కాంచె మెఱింగితిని. నీ వలన సమూలంబుగాఁ దెలిసెఁ గాని--

ఉ. సూతునిచేతికిం దొరకి, సూతకళత్రముపాలు ద్రావి, యా
సూతునియన్నముం గుడిచి, సూతకులాంగనయందు నందన
వ్రాతము గాంచి నేఁటి కొకరాజకుమారుఁడ నంచుఁ దెల్ప నా
చేతము సమ్మతించునె? యిసీ ! యెవ రేగతి సిగ్గుమాలినన్.

క. లాలాస్వేదాదులఁ దా
నోలిన్ భరియించి నన్ను నోమినతల్లిన్
శీలపతి నంత్యకృతికిన్
బా లొనరింపకయమున్నఁ బాడియె విడువన్ ?.

ఉ. కామముచేతఁ గాని, భయకంపిత చిత్తముచేతఁ గాని, యీ
భూమి సమస్త మేలుకొనుపూనిక చేతనెగాని నేను నా
సేమము గోరి చుట్టముల స్నేహితుల న్విడనాడి నేఁడు మ
త్స్వామి సుయోధను న్విడిచి వత్తునె? వచ్చిన మెత్తురే జనుల్?.

చతురుదధివేలావలయితం బగు నీగరామండలంబున కంతకుఁ బట్టము కట్టుకొంద మనుపేడుకయును నాకు లేదు.

శా. నా నేస్తంబును నా బలంబు మఱియు న్నా పెంపు లోనమ్మి యే
భూనాథుండు దిటంబుగా రిపులతోఁ బోరాట మాసించె, నా
భూనాథు న్విడనాడఁగాఁ దగునె? రేపో మాపో చా నుంటి మే
నానం జెప్పెద నింతమాత్రమున కేలా యిట్టివా దచ్యుతా ?.

గీ. "అర్జునుం డోడుఁ గర్ణున కనుచు జంకి
పన్నె నీ పన్నుగడ" యంచుఁ బ్రజలు నిన్ను

నన్ను “సూతసుతుండు పాండవుఁడ నంచు
రోయ కేగె” నటంచు దూఱుదురు కృష్ణ!.

పదమూఁడు సంవత్సరములనుండి సుయోధనుండు పేరుగా నేకచ్ఛత్రం బుగ నీభూమండలం బంతయు నేనే యేలితిని కావున విషయసుఖం బులమీఁది యాసయుఁ దీఱిపోయె. కాకున్నను ఇంకొక విశేషంబు గల దాలకింపుము.

ఉ. నాదుహితంబు గోరియె జనార్దన తెల్పితి వింతపట్టు, వా
రాదృతిమై ననుం గనుట యబ్బురమే భవదాజ్ఞ? రాజ్యసం
పాదన మే నొనర్చినను పాపుఁడ ధార్తరాష్ట్రసూతియే
కాఁ దగుఁ గాని యే నగుట కల్ల; భటుం డెటు లేలి కయ్యెడిన్ ?

నా కెట్లును రాజ్యార్హత లేదు. నేను దన కగ్రజుఁడ నని తెలిసినచో ధర్మమూ యగు యుధిష్ఠిరుఁడు రాజ్యం బొల్లక పరిత్యజించుట నిక్కవము. అట్లు జరుగుట లోకులకే కాదు నాకుఁగూడ నసమ్మతమే. ఏ మంటివా?

గీ. నిత్యసత్యవ్రతుం డన నెగడు ధర్మ
తనయుఁడే నేల నేలఁగఁ దగినవాఁడు
కురుపతిని గెల్తురే నెఱుంగుదును నిక్క-
వముగ నీదయచేత నే పాండుసుతులు.

మ. అరయన్ నేరనివాఁడఁ గాను విను కృష్ణా! యుద్ధయజ్ఞం బొగిన్
జరుగున్, దానికి హోత యర్జునుఁడు; స్రుక్సంపత్తి గాండీవ; మ
త్కురురాట్సైన్యమదంబు యాజ్య మగుఁ దక్కుంగల్గు సర్వంబు నే
ర్పరి వీవే ఘటియింతు వేత్తవును నధ్వర్యుండవున్ గావునన్.

తే. గీ. అఖిల మెఱిఁగియుఁ బార్థుల ననఘసుతుల
నట్లు సభ నాఁడు నే దూఱినాఁడు చెల్ల
నలసుయోధనుప్రియమున, కది తలంపు
వచ్చి నామన మ్మద్ద విచ్చి పొగులు,

ఇ(క నాకు సెలవిమ్ము. ధర్మ నయున యుదంతము తెలుపకుండ నాకు వర మిమ్ము.

కృష్ణు: నలో ఔరా! యీతని మనోనిశ్చయము! (ప్రకాశము) వికర్ణ కుమార! సర్వజ్ఞుండ వయ్యును దొల్లి రాపణ నిగతి ననుకరించు చున్నా(డవు. నాకేవో కొన్ని ముఖప్రీతికరము లగుమాటలు చెప్పి మరి(గి పో(దలంచుచుంటివి కాని నీకు( బూర్తిగా జయాభిలాష కల్గియున్న దనుట నే( గనిపెట్టితిని. ఈమాట(గూడ విని యరుగవచ్చుగాక.

శా. సేవాధర్మము గాన రాజ్యమును శాసింపంగ నే( జాల నం
చీ వాడన్ జనునయ్య? జేసికయి యెందే నేగి యార్జించునా
శ్రీ వాలింప(గ రామి కొప్ప(జను, నీశ్రీ యేను నీ కిచ్చున
ద్దేవా( డాధృతరాష్ట్రసూతి గొన(గా? నేమందు వీమాటకున్.

ఉ. పట్టిభిభీషికల్ సలుపుపై ఖరి గా దిది; భీష్ము( దొట్టి మి
మ్మెట్టులనేని బట్టి వధియించుట నిక్క(వ; మట్టిసూచనల్
పట్టు(గ( బార్థులందు( గనుపట్టుచునున్నవి పేనపేలు, నీ
చెట్టతలంపు మాని దయసేయుము ధర్మజునొద్ద కొప్పుగన్.

తే. గీ. అరిగె( గృతమును త్రేత ద్వాపరము జరిగె
నిట్టికదనంబు( బార్థునియట్టిజోదు
నెందు నేరును జూచి మున్నెఱు(గ రన్న
పగిది( దెలియంగ(బడు( జుమ్మి మగుడు మిటకు

క. ఈపే కారణ మింతకు(
జావపు నీపౌర(డపే విశాంపతు లెల్లన్
నీవలన బ్రమందుదురు నీ
సేవాధర్మమున కేమి? చెడు జగ మెల్లన్.

కావున( బిదప విచారించిన లాభ ముండదు. మున్నె మేల్కొనుము. మాటాడపేము.

కర్ణు- నందనందనా! నీ వాక్యంబులం దొక్కటియుఁ బ్రత్యాఖ్యానం బొనర్పఁదగినది లేదు. సర్వమును నీ పనినట్లే జరుగును. ఇంత గుఱుఁ తెలిఁగిన నీకుఁ గర్ణునిమనోనిశ్చయముమాత్ర మగోచర మగునా? అట్లెటిఁగియు నన్నేల నిర్బంధించెదవు?

చ. ఇపుడు తటస్థమైన పృథివీంద్రమహాప్రళయంబుపట్ల భూ
మిపతియుఁ దమ్ముఁడు న్శకుని మిత్రుఁడు నల్వురు వీరు కారకుల్
కపటము లే దొకింత యటఁ; గౌరవనాశన సూచనల్ నిజం
బపరిమితంబుగాఁ గనఁగ నయ్యెడు నాకను నేమి సేయుదున్.

మ. మన మప్పార్థులవంకకున్ జనదు కర్మం బెట్టిదో! సారె చె
ప్పిన లాభం బిఁక లేదు, కీర్తి కయి పృథ్వీనాయకుల్ పోరి చ
చ్చినఁ జాని, మ్మిది భారతావనికి సుశ్రీ దెచ్చి దృష్టాంత మై
చనుఁగా కెల్లెడ మేటిసత్కవులవాచాశుద్ధికిన్ మూల మై.

కృష్ణ- (నైరాశ్యమును సూచించుచు

గీ. పృథివికి వినాశనము సమీపింపఁబోలుఁ
గానిచో నానుడుల్ మది నూననేర
నంతటిని కృష్ణుఁడే కర్ణుఁడు? (తల పంకించి పెదవి విఱచి
అగువినాశ, కాలమునఁ జెడ్డ మంచిగాఁ గానిపించు.

కర్ణు- (వినియు విననియట్లు నటించి బావా! వసుదేవనందన!

క. సకలక్షత్రకులవినా
శక మగునీసమరభరము సడలినపైఁ దీ
రికమై నిను దర్శించెద
నాకా! స్వర్గమునందుఁ జూతు నాకా! లేకున్నన్.

నా కాజ్ఞ యొసఁగుము.

కృష్ణ- మంచిది.

కర్ణు- (నిష్క్రమించును.

ర్ణు.... (తనలో) ఇఁక సంగర మెట్టును దప్పదు. యావ . ని . యోగించి
గావున నన్ను లోకులు నిందింపరు. పరిక్రమించి వెనుకఁ జూచి యోజించి) పునవును. కుంతి యొకసారి ఈతనికి నిక్కము బోధించినచో నితని వెత్తి మరునేమొ? (పెదవి విఱచి) వినఁడు–

క. జనని వచించిననిక్కము
జనకుండు వచించినను "యశమొ చచ్చుటో" త
క్కొనవితర మిత్రఁడొల్లఁడు
కనుఁగొనఁ బ్రాణంబు తృణము గా దీతనికిన్.

ఎమ్మ. ఇచ్చట సభావిశేషములును విశేషించి కుంతి బోధించిన నీతులును ధర్మజాతున కెఱింగింతుఁగాక! (నిష్క్రమించును.)

ంతి.... (ప్రవేశించి తనలో) అకటా! నే నేమిసేయుదును? కర్ణుఁడర్జుననిచే మడిసినను నర్జునుఁడు కర్ణుచేఁ జెగినను నాకొకవిధమైన దుఃఖమే; కావున నెల్లేనిఁ బోయి బోధించి పాండవులం జేర్తుఁగాక! (యోజించి) ఇది గాక యితఁడు తప్ప దుర్యోధనుసేవలోఁ పాండవుల కపకృతిచేయఁదగు పేరు గల యోధు లంతగా లేరు, భీష్మద్రోణకృపాశ్వత్థామ లెన్నఁడును నాసుతులయెడఁ బ్రేమ దప్పి వర్తింపరు కావున వీని నెల్లేని ద్రిప్పి సుఖముండెదఁ గాక! (పరిక్రమించి) అదె భాగీరథీతీరమునఁ గృతస్నానుఁడై నాయగ్రతనూజుఁడు సూర్యోపాస్తి యొనరించుకొనుచున్నాఁడు.
(సమీపించును.

ర్ణు— దేవీ! అతిరథసుతుండును రాధేయుండును నగు వసుషేణుండు నమస్కరించుచున్నాఁడు.

ంతి.... (కౌఁగలించుకొని) తండ్రీ! నీవు కౌంతేయుండవు గాని రాధేయుండవు కావు. కుంతిభోజునింట నేను గన్నెనై యుండి దూర్వాసుం డొసంగిన

వరంబు పరిశీలింప దివాకరుం దలంచిన నతని ప్రసాదంబున నాకు నిన్నను గ్రహించె. నేనును గౌలీనంబునకు జడిసి నిన్ను గంగాజలంబుల విడిచితిని. సహజంబు లగుకవచకుండలంబులుండు కతంబునఁ దండ్రికంటె వేయిమడుంగులు కాంతియందు మిన్నపై యున్ననిన్ను వదలిన మహాపాపాత్మురాల నగు నాయపరాధంబు మన్నించి నీతమ్ములతోఁ గలసి రాజ్యమేలుకొనుము.

(ఆకాశమునందు

చ! నిజము కుమార! కుంతికి జనించిన మాట నిజంబు భాస్కరా
త్మజుఁడవు తల్లి చెప్పినవిధంబునఁ జేయుము రాజు లందఱుం
బ్రబలియు యుద్ధంబు నొందఁ గురుపాండవయుద్ధము మానిపించి ధ
ర్మజునకుఁ బ్రీతి గొల్పి యసమానయశోభరము న్వహింపుమా !

కర్ణ....పాండుమహిషీ! ఏను గుంతీనందనుఁడ ననుమాట నీవెకాక యాకాశవాణికూడ స్పష్టపఱచెఁ గదా! అయినను,

ఉ. కూటికి గుడ్డకై పరులకొంపకుఁ జేరి త్రయోదశాబ్దము
ల్నాటిన దుఃఖము ల్మది కలంపఁగ నుంటివిగాని "యిట్టి దీ
మాట" యటంచుఁ దెల్పితివె మానిని! యాత్మహితంబుఁ గోరి యీ
నాఁటికి జెప్పవచ్చితిని నాపయిఁ బ్రేముడి కల్గుపోలికన్.

ఉ. ఇంచుకయైన లోఁగరుణ యెంచక కన్నకుమారు గంగ క
ర్పించిన గొడ్డురాల విఁకఁ బ్రేముడి యెక్కడిదమ్మ నీకు? నా
యంచితమైన రాచకొల మాఱడిపుచ్చితి సూతధర్మము
ల్గాంచితి పీటిఁబుచ్చినకులం బిఁక వచ్చునె? సంధిఁ జేసినన్.

పంచపాండవులనుమాటను వేఱుచేయుట నాయభిమతము గాదు. అది యునుంగాక,

ఉ చిన్నతనంబునుండి దయచేసి రమావిభవం బొసంగి నా
యున్నతిఁ గోరి నాపయి జయోద్ధతిఁ బూన్చిన రాజుకన్న నా

కన్నులఁ దమ్ములం గొడుకు లాప లు నెక్కఁ
యన్నపత్రాణి వాని విడనాడుట నాపని గాదు ని !

: కుమార! పంచపాండవు లనుమాట పేఱుచేయుట నాయభిమతము కాదంటివే కానిమ్ము. అట్లే నాకు వర మిమ్ము.

: పాండవజననీ ! నీయభిమతం బొసంగితిని. నీవచ్చిన కార్యము సఫల మాయెఁ గదా! యిఁకఁ జనుము.

గీ. సమరమునఁ జేతఁ బడినను జంప నేను
ఫల్గు నుఁడుతప్పఁ దక్కిన పాండుసుతుల
నేను మడిసిన నున్నవా రేగు రుందు
రతఁడు మడిసిన నున్నవా రేగు రుందు

: తనలో) అర్జునుఁడు వీనిచేతఁ జిక్కువాఁడు కాఁడు. (ప్రకాశము) కుమారా! ఉపపాండవు లేవురపైఁగూడ దయయుంచుము.

: కురుకులపధూమణీ ! ధర్మపుత్రాదులతోఁ గలియు మనుటతప్ప దక్కిన నీయభిమతమ్ము లన్నియు నెఱవేర్చెదను.

క. హరితో నరుడెంచెడి నరు
నరసి భయం బందినట్లె యప్పార్థులతో
నరుడెంచెడి నన్నుం గని
పారిఁబోరి నప్పుడురు శత్రుభూపతు లెల్లన్.
(నిష్క్రమింతురు.)

గద్యము.

ఇది శ్రీ.... తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁ
బడిన పాండవోద్యోగమునందుఁ
చ తు ర్థాం క ము.

.... ౦ ....

శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవోద్యోగము

నాటకము

## పంచమాంకము

పంచపాండవులును శ్రీకృష్ణుఁడును ప్రవేశింతురు.

ధర్మ : కృష్ణా! వసుదేవనందన !

ఉ. ఇంతకుమున్న నీనుడువు నెల్ల విశేషము లాలకించితిన్
జింత నశించె నాహవము సేయుఁ దలం పుదయించెఁ గౌరవ
ధ్వాంత మడంచి భూపతిపదంబు వహింపఁగ నిచ్చ పుట్టె న
ర్వాంతము కాక తీఱ దకటా ! యెవ రాఁగఁగలారు దైవమున్ ?

భీమ : అన్నా ! దైవ మేమి చేసె? అన్నిటికిని నస్మద్రుకులపాంసనుం డగు సుయోధనుఁడే కారణము.

ఉ. వానిమదం బడంచి బలవంతుల వైరుల నెల్లం ద్రుంచి మున్
బూను ప్రతిజ్ఞలన్ నెఱపి భూమికి నిన్ బతిఁ జేసి యయ్యర
ణ్యాని వసించుచున్ గుడిచినట్టిమహావ్యథలెల్లఁ గల్లగా
మానవతీలలామ కభిమానము నిల్పెద యాజ్ఞ సేనికిన్.

పటాక్షేపమున నొకపురుషుఁడు ప్రవేశించును.

పురు : దేవా జయము! జయము! తమ యాజ్ఞానుసారమున స్కంధావార మెల్లం జూచి వచ్చితిని. ఇరుభాగసును సర్వసిద్ధముగా నున్నారు. మఱియొక్క

మనవి. కురురా జెందులకో గాని యులూకు - ంటి కంపునసువార్త నొకఫణిహారివలన వింటిని. ఇంతట నంతట నతఁడును రావచ్చును.

కృష్ణ: నీవు పోయి యాఫణిహారి నిట కంపింపుము.

పురు.: చిత్తము. (నిష్క్రమించును)

ఫణి : (ప్రవేశించి జయము జయము.

భీము : కౌరవసేనయందలి విశేషము లేమి?

ఫణి : సుయోధనుఁ డడుగఁగాఁ గురువృద్ధుఁ డగుగాంగేయుం డుభయ సేనలందును నతిరథమహారథనిర్ణయ మొనరించునప్పుడు —

అర్జు : ఏమి జరిగెను?

ఫణి : కర్ణు నర్ధరథులలోఁ బరిగణించెను.

ధర్మ : ఈ విషయమునఁ దాతగారిదే లోప మనక తీరదు.

తే. గీ. అతఁ డర్ధరథుండైన నన్యుఁ డెవ్వఁ
డతిరథ మహారథాభిఖ్య లందువాఁడు ?
తాతగా రేలొకో! యంత చేఁతఁగాని
వానిఁ గాఁ గర్ణు నెంచి రనూనబలుని.

కృష్ణ: ఓయీ! అర్జును నేతరమునఁ బరిగణించిరి?

ఫణి : క. నరుఁ డేతరమున వాఁ డని
తరమే వర్ణింప నతనితర మాతఁడె తా
నరయంగ లేఁ డనిన నొం
డొరు లెవ్వరు నిర్ణయింతు రుర్వీస్థలిలో.

అని చెప్పిరి.

అర్జు : తాతగారీయెడ సూతపుత్రుని మాత్రమే కాక నన్నుఁ గూడఁ బూర్తిగా నవమానించినారు.

క. పార్థుఁడఁట! కర్ణుతోఁ దా
నర్ధరథునితోడఁ బోరునఁట! యని మింటన్
స్వార్థాము లాడుపలుకులు
వ్యర్థమనోరథుని జేయవా ! నన్నాజిన్.

కృష్ణ - దానికేమి! రేపటినుండి నిన్నెదురొ్కనువా రందఱును నతిరథ మహారథ సమరథులే యగుదురా ?

క. కొందఱు మహారథులు మఱి
కొందఱు సమరథులు మఱియుఁ గొంద ఱతిరథుల్
కొందరు నర్ధరథులు నీ
సందడి కయ్యమున నుండ్రు జనవరు లందున్.

నకు-- అన్న తాత్పర్య మది కాదు. ద్వంద్వయుద్ధ మనునది సర్వవిధముల సమానులకే యేర్పడినది కాని, తదితరులకుఁగాదు. కావున నిది విచార్యమే.

కృష్ణ-- భద్రా! కర్ణు నర్ధరథులలోఁ జేర్చుటకు గాంగేయుం డేమి హేతువులు చూపెను ?

ఫణి-- ఇతని కింతకుమున్ను తటస్థించిన గురుశాపావికము నుదాహరించి తన మాటలు దాను సమర్థించుకొనెను.

కృష-- (ధర్మజునిడకై_)శాంతనవుని నిర్ణయము కడు న్యాయ్యముగా నున్నది.

ఉ. అర్జునుఁ డన్నచో శివుని యాహవమున్ జవిఁ జూచినట్టిదోః
ఖర్జుఁడు నిర్జితాసురుఁ డఖండుఁడు; కర్ణుఁడు బాహుసంపదన్
దుర్జయుఁ డైన నీయనఘుతోఁ దులయే! గురుశాపదగ్ధుఁ; డ
త్యూర్జితు లైననున్ విజయ మొందదు సూ! గురుశాపదగ్ధులన్.

ధర్మ-- ఏమైనను దాతగారి యశశ్చంద్రునం దిది యొకకళంకముగా లోకు లనుకొనక మాన రని తలఁచెదను. ఫణిహారిదిక్కై_ కురు పితా

మహాత్ముఁడు తన్నర్ధరథులలోఁ జేర్చిన యంతఁ గర్ణుఁడు సమ్మతించి యిన్న
కుండెనా ?

ఫణి— అతఁ డేల యూరకుండును! తోఁకఁద్రొక్కిన త్రాఁచువలె నిట్టూర్పు విగు
డించుచు "ఓయీ! పితామహా!

మ. విను మే నర్ధరథుండ నైన సగుదున్ వీరుల్ విచారింప నం
దునకు న్నిన్ గొలఁగా పటంబ్రదు గడుప్పృద్ధుం డంచు నిన్ హేఁడు మ
న్ననమైఁ జూచి వినిర్ణయంపుఁబదవిన్ దార్కొల్పుటే తప్పు గా
ని, నినున్ జెప్పు మటన్నయప్పు డగుఁగా! నీ యిష్టమే యిష్టమై.

క. వీఁ డెట్టిఁ డైన నగు నీ
పోడిమి యాలమున వడఁగి పోవుదనుకఁ బో
రాడుటకు రాఁడు నీపస
చూడఁ గలరు వీరులెల్ల శూరమ్మన్యా !.

అని యత్రసన్యాసము గావించెను.

కృష్ణ— ఇది పునరుక్తి. అతని యత్రసన్యాసమునుమాట కేమిగాని—

ఉ. మ్ముందుగ భీష్ముఁ డల్గి నని మోఱకు! డీతనిపోర చెప్పె, దీ
నం దెలియంగనయ్యె ఘటనందనుఁ డాపయి నీల్గు నంచు; మి
న్నందినవాఁడునుంబలె దురాగ్రహమున్ బ్రకటించు నీతఁడా
క్రమందక యుండువాఁడు? సుగమం బకుభం బని తేలె వారికిన్.

ధర్మ— అగుఁగాక! సూతపుత్రుని దురాలాపమ్ములకుఁ దాతగా రేమనిరి ?

ఫణి— అనుట కేమున్నది! తత్కాలోచితమ్ముగఁ దనకున్ జనినిచిన కోపావేశమ్ము
నెల్లఁ జిఱునవ్వుగా మార్చికొని "ఓయీ రాధేయ !

చ. నృపతి సమీకధార మిది నెత్తిని మోపినవాఁడు గాన నీ
చపలత సిడుసిచతయు సాఁగుటకున్ దటి యయ్యెఁ గానిచోఁ
జపలపలాడు నీ వడుచు తప్పుడు పౌరుష మేమి మానా! వి
నిపలితభావ మే మగునొ నీ కెఱుఁగన్ బడకున్నె యింతకున్ ?.

క. నీ వెంత నీఁటఁ గల్గిన
చేవయు నది యెంత! నీవు సేయుసహాయం
బావంత గాదు నాకుఁ ము
దావహ మే! నీవు రామి యావహముసకున్.

ప్రతిహారి— (ప్రవేశించి) జయము! జయము ! శకునిపుత్రుం డగు నులూకుండు వచ్చియున్నవాఁడు.

ధర్మ- శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

ఉలూకుఁడు- (ప్రవేశించును).

ధర్మ- (చేతఁ జూపి) ఆయాసనము నధిష్ఠింపుము.

ఉలూ- కూర్చుండి)

మ. వినుమా! యోయి! యజాతశాత్రవ! మహావీరుండు దుర్యోధనుం
డనుపంగా నిట కేగుదెంచితి, నతం డాడంగ శాసించి పం
చిన మాటల్ గల వొక్కకొన్ని, యవియే చెప్పంబడున్ ధర్మి నీ
సును బోనాడి వినంగఁ బాడి యగు నీ సోదర్యులున్ నీవునున్.

ధర్మ- దూతవై వచ్చిన నీపైఁ గనలుటకు నే నేమి సుయోధనుఁడ ననుకొంటివా! నీ ధర్మమును నీవు సంపూర్ణమ్ముగ నెఱవేర్చి కొనవచ్చును.

క. చేయఁ గలకార్య ముండినఁ
జేయన్ వలె ధార్తరాష్ట్ర శిక్షింపవలెన్
న్యాయముగ రణమునం ద
న్యాయముగా దొక్కొ! దూత వగునిను నొంపన్.

ఉలూ- దానికేమి! యది విచారణాంతరము, ప్రకృత మనుసరింతము. నా మొగమున సుయోధనుం డనిపినపలుకు లివి.

చ. సలుపు ప్రతిజ్ఞలన్ నిలుపఁ జాలఁ బ్రయత్న మొనర్పఁ దూరకే
పలికిన లేదు లాభము, సభాసదు లందఱు మున్ వినంగ నీ

పలలుడు ప్రేతె నాతొడలు వచ్చెద నంచు,
గులు మెడ దాల్చి శోణితము గ్రోలెద నంచును ... యున్నదే ?

(ప్రత్యేకించి పాండవులను గేలఁజూపుచు)

ఉ. జోగితనాన నొక్కరుఁడు, సూపుఁడుగా నొకరుండు, పేడి యై
భోగపుబిడ్డె నేర్పుచు నపుంసకతాభర మూని యొక్కఁ, డు
ద్యోగము వాజిశాలఁ గొని యొక్కఁడు; వేఱొకఁ డాలమందలోఁ
బాగటి యూడిగంబు గొనుబాలిశులొక్కొ! ననున్ జయించుటన్.

ఉ. ఎవఁడు పితామహున్ దొడరు! ద్రోణు నెప్పఁడు నెదుర్చు! నెవ్వఁడా
హవవిధుఁ గర్ణు నోర్చు! నెవఁ డాఁగుఁగృపు! న్గురుపుత్రుతోడఁ దా
నెవఁ డని సేయునో? సరిగ నిప్పుడ చొప్పడ నేర్పరించుకొం
డవల విచార మంది ఫల మందరు రే పని ముందుఁ డందఱున్.

(భీమాదు లొకరిమొకము లొకరు చూచుకొనుచుఁ గోపావేశము
నటింతురు.)

కృష్ణు: (విచారించును.)

ధర్మ : ఇంకను జెప్పుమనిన వున్నవా! సమాప్త మయ్యెనా ?

ఉలూ : కలవు వచించుచున్నాఁడను. అప్పుడే నీతమ్ములకు నాపై నా
గ్రహ ముదయించు గుఱుతులు కనుపట్టుచున్నవి. ఇంక ముందు వీరు
బొత్తిగా వినఁజాలరు కదా!

అర్జు : చిఱునవ్వుతో)

శా. బావా! నీపయిఁ గోప మేమిటి కహో! బ్రహ్మాస్త్రము న్దీయునే
యే వాఁడేనియుఁ జాటకై రముపయిన్! హేయాతిహేయంబు గా
దే! వీరుం డటు చేసినన్; కడమ సందేహంబు లేకుండ వా
చాపైదగ్ధ్య మెలర్పఁ జెప్పి కురురాజప్రీతి సంధింపుమా!

ఉలూ: (తనలో) అర్జుని మాటలు నాకుం బోటులరన్న మిన్నలై నాటుచున్నవి.
అయినను నిందుఁ గోపంబు కర్తవ్యంబు గాదు. ధర్మ జాంకుశంబునకుఁ

దక్కిన మూడుగజమ్ములను లొంగినట్లు భీమమత్తేభంబు లొంగదు.
(ప్రకాశము) శేషము నాలకింపుఁడు.

ఉ. ఈ రొక రాజపుత్రకుల రేని ధ్రువంబుగ నాజి నిల్చి మీ
వీరము చూపుఁ డర్జునుని పెద్ద ధనుస్సును వాసుదేవు నే
మారసి భాగ మిత్తుమని యాత్మఁ దలంచితి రేమొ! భీష్మునిన్
జేరిన యుత్తరక్షణము చేరెడిఁ గవ్వడి కాలుప్రోలికిన్.

మ. సభలోఁ బెండ్ల మనాథపోల్కి పగపన్ శౌర్యంబుఁ జూపింపలే
ని భవాదృగ్రిపుసంతతిన్ రణములో నే నెట్లు సంధింతు! ఈ
రభువుల్ తాదృశకాలమందుఁ దమధైర్యస్థైర్యగాంభీర్యధూ
ర్వైభవంబుల్ ప్రభ దక్క నమ్రముఖులై భీపెంపు పాటింతురే ?

భీమాదులు మరలఁ గలలు పంకించుచుందురు.

(కృష్ణుఁడు మరల వారించును.

ధర్మ : (తొందరగా) అయినదా ! యింకను సుడుపవలయునా! భయములేదు. దూతవు గదా! తుట్టతుదవరకుఁ గానిమ్ము.

ఉలూ : ఇఁకఁ గొంచెముమాత్రమె యున్నది వినుండు.

ఉ. మాయలమారి, కొంపలను మాపు నుపాయము లెన్ని యెన్ని యో
సేయఁ గలాఁడు జ్ఞాతు లని సేయఁగఁ బన్నినవాఁడు మాధవుం
డే యిఁక మీకు దిక్కగుత; కృష్ణులు జిష్ణులు నెంద ఱెంద ఱే
మాయలు పన్నినన్ భయము మా కుదయింప దెఱింగి రం డిఁకన్.

అని సూత్రప్రాయముగా మీయెల్లరకున్ జెప్పు మనియె.

భీము : పండ్లు పటపట గొఱికి మండిపడి ఓయీ! దుర్ద్యూతరత తోక! కౌశికా పరపర్యాయాఖ్యాక! ఉలూక!

ఉ. దూతవు గాన నీపలుకుదుండగముల్ సయిరించినాఁడ, నీ
నేతమదం బడంచునెడ నీవును దంష్ట్రియు గ్రుడ్ల నీటితోఁ

జూతురుగా ! యప్పటికె శూ ... డు ...
ర్ద్యూతము దుంపఁ దెంపి జము ప్రోలికిఁ ... ఁడు...

క్ర- తమ్ముఁడా! యొరులకు బోధించుటకు బదులు నీవే కోపపడిన నిఁకఁ గవలా సైరించువారు?

ష్ణ- (భీమునిఁ దనవెనుకకుఁ దీసికొని సకోపస్మితముతో గాంధార రాజ తనూజ! మీతేనితో నామాటలుగా వచింపుము.

చావు ధ్రువం బటం చెఱిఁగి చావుము శూరులు మెచ్చునట్టు; లీ
చేప రణాంగణంబు దయచేసినయప్పుడు చూప్పు టొప్పుఁ గా
కీవిధి నూరకే మొఱఁగ నెవ్వరు నవ్వరె! చివ్వ యెల్లియే
కావునఁ దత్తఱంబడుట కర్జమె! గర్జలు దుర్జయంబులే?.

. విఱుగ న్గొట్టుట నిక్కమే యెఱుఁగు మూర్వీనాథ! నీయూరువుల్
సరిగాఁ గావొనరించుకొ మ్మనుజవక్షస్సీమ కౌక్షేయకా
క్షరధారన్ విదలించి శోణితము నాస్వాదించు నీభీముఁ; డె
వ్వారు మాన్పం గలవారు వారి నిపుడే ప్రార్థించి కాపుంచుమా!.

లూ— తనలో ఈ మాటలు విని యూరకుండుటకన్న మానికిఁ జావు కడు మేలు గదా! దీనికంతకును నెల్లి రణమ్మున నాయస్త్రశస్త్రములే ప్రత్యుత్తరం బొసంగుఁగాక! (ప్రకాశముగా) నే నిఁక నరుగవచ్చునా?

ర్మ- ఇదిగో! నరుగుదువు గాని- ఎవఁడురా! అక్కడ? చందన తాంబూలాం బరాభరణాదులఁ దీసికొని రమ్మ. ఈ గాంధారరాజతనూజుం గారవింప వలయు.

టు— తత్సహితముగాఁ బ్రవేశించును.)

ర్మ— (అవి యిచ్చి గౌరవించును.)

లూ— (పరిగ్రహించి ప్రయాణోన్ముఖుఁ డగును.

ర్జు- ఓయీ! రవఁడి యిట్లు చెప్పెనని మీరాజునకున్ జెప్పుము.

శా. వా రున్నా రని వీర లుండి రని దుర్వారంపుగర్వోక్తులన్
నో రారన్ వ్యయ మేల చేసెదవు? నిన్నున్ బట్టి గాంగేయునిన్
బోరన్ జంపక మాన, మళ్లె గురులన్ బోకార్తు, మామీఁద ని
స్సారున్ గర్ణుని దోలు వెంతసని! వాచాశూరునిన్ భీరునిన్.

ఉ. వీర లవధ్యు, లందుఁ గురువీరుఁడు భీష్ముఁ డవధ్యుఁ, డందులో
దీరుఁడు కుంభజుం, డతనిదీ టగువాఁడు తదాత్మజాతుడో
స్సార మపార, మల్లకృపుశౌర్య మవార్య, మటంచుఁ బొంగెదో
సారసనేత్రుఁ డండటిని జక్కఁగఁ బెట్టఁగలాఁడు లేఁడొకో?.

క. ఒరుల భుజసార మే కద
శరణము నీ! కాత్మబాహుశౌర్యౌదార్య
స్ఫురణంబు సున్న నీకై
కురువృద్ధున్ గూల్పవలసె గురువృద్ధులతోన్.

ఉలూ: (కోప మడఁచుకొనుట నటించుచు నిష్క్రమించును.)
ధర్మ : (కృష్ణునితో) బావా ! వసుదేవనందన!

క. మును రుక్మి విరూపునిగా
నొనరిచి రుక్మిణిని గొన్న యుక్తిపరుఁడ వీ
వని తోఁచె! నీరూపుని
గను నరి నొనరించి లక్ష్మిఁ గైకొన లేమే?.

భీము : బావా! మహానుభావ!

ఉ. ఏడుచుఁజుమ్మి జేఁడు; తనయొట్టెదుటన్ సహజుల్ దసూభవుల్
పోడిమి దక్కి యాలమున బూడిద పాలయి పోయి సైన్యముల్
గూడ నశించి తాఁ బిలువఁ 'గో' యనువెంకయు లేక సర్వమున్
గాడయి తోఁచినప్పుడు వికావికలై యెద తల్లడిల్లఁగన్.

కృష్ణ: ఇంతయును నీ భారతమునకు సూచనయే. అమాయికుఁడవగు నీ చోట
ఫెల్లువడిన యక్కరము ళే నిక్కము గాకున్న మాయకుఁ దగుభగవం...

మాటలు వేదములా నిక్కమ౼

చ. ఎవఁడు దురాగ్రహమ్మునఁ బయిం బడుచెట్టఁ దలంచెఁ బోక కా
దవు ననుచింత సుంత మది నానఁగ లేక కృతఘ్నతాగతిన్
దవిలి మహోపకారు లగుతమ్ముల సన్నను ధిక్కరించె న
య్యవినయపుంగ నిన్జెఱుపఁడా ! భగవంతుఁడయో ! సుయోధనున్.

అ. వె. నాఁడు ఘోషయాత్రఁ బోడిమి చెడి చచ్చు
వాఁడె కాఁడె! తాను బాండవాగ్ర
జుం డమాయికుండు సుంత తమ్ముఁ డటంచు
బలిమిఁ జేసి పార్థుఁ బంపకున్న.

ప్రతిహారి: (ప్రవేశించి) జయము ! జయము ! రుక్మియను విదర్భ దేశాధిపతి దర్శనమునకై వచ్చియున్నాఁడు

ధర్మ: (కృష్ణునితో) బావా! యేమనియెదవు?

కృష్ణ: చిఱునవ్వుతో) శీఘ్రముగ రమ్మనుము.

ప్రతి : (నిష్క్రమించును.)

రుక్మి : (ప్రవేశించును.

ధర్మ : (సగౌరవముగా) ఆయాసన మలంకరింపఁ బడుఁగాక!

రుక్మి : కూర్చుండుట కేమి? కూర్చున్నను గూర్చున్నట్లె కూర్చుండకున్నను గూర్చున్నట్లే! (అర్జునుదిక్కై౼)

చ. విజయుఁడ! నన్ను నీ వెఱుఁగవే! విజయ మ్మనువిల్లు నాది మూఁ
డుజగము లేకమైనను జెడున్ జుమి వ్రేల్మిడి దానిచేత; నీ
గజగజ కొంత నేను విని కయ్యమునన్ గెలిపింప వచ్చితిన్
బుజములతీఁట వోఁగ రిపుపుంజముఁ ద్రుంచెద నిన్ భరించెదన్.

చ. భయపడి తీర్థయాత్రరు నెపం బిడి పోయెను బెద్దగొల్ల; నీ
క్షయి యితఁ డెట్టులో యనికినై చనుదెంచినవాఁడు గాని య్యే

మి యగును? నిట్టిగొల్లల కమిత్రులు జంకరు జంకితేని ని
శ్చయముగఁ జెప్పు మే ననికి సాయముఁ జేసెద నిన్నుఁ గాచెదన్.

భీము- మండిపడి గద గైకొని అరే! కృతఘ్నా! యేమంటివి?

క. ఈ కృష్ణుఁడు నీ శిరమున్
బోకార్పఁ దలంపఁ గరుణ బొంపిరి వో నిన్
జాకుండఁ జేసినందుల
కా! కృతమున్ మఱచి కాఱు లఱచెద విట్టుల్?.

తే. గీ. మూడు లోకమ్ము లేకమై మొనయుఁ గాక
యలహలాయుధునకు జం కనంగ నెట్టి?
దోయనాత్మజ్ఞ! గురుదూషణోక్తి కొక్క
మాఱు సైఁచితి నిఁక నొక్కమాఱు సైఁప.

కృష్ణ- (వారించి) ఏమీ! నీ కీపెట్టికోపము.

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
వుచ్చెడి పెట్టులును గలరె! ముసలాయుధు నీ
పిచ్చిపెడం గెదియో యన
నచ్చునె లోకులకు వీనినాలుకయె చెడున్.

ఒక్కమాఱు కాదు పదివేలసారు లన్నను నీ పీఠనిప్పైఁ గనలకుము. నే నెందులకు
మిన్నకుంటినో నుంత విచారింపుము.

భీము- ఆవేశముతో) నీవు రుక్మిణిం దలఁచి యన్న నొక దేబె నిందించినను విని
సైరింతువు గాక!

మ. గురునిందన్ విని శిష్యుఁ డెవ్వఁడును శక్తుం డైనచో నాజడున్
దురితాత్మున్ బరిమార్చకుండిన గురుద్రోహంబు వాటిల్లు, నె
వ్వరు వారించిన నాఁగఁ డీతఁడు, రణప్రారంభమం దీదురు
ద్ధరణున్ జంపి గురుప్రియమ్ము ననుసంధానింతు ముమ్మాటికిన్.

రుక్మి- (తనలో) ఇతని దురుక్తులు విని సైరించుట కడు భరముగా నున్నయది,

వీ( డొక్క(డేయైనచో నా జ క(
దఱును నాపై కురుకవచ్చును. వి

అర్జు- అన్నా! గురునింద విన(గూడ దని నీవు నొడివిన పలుకులు కడులెస్స పలుకులు. అయినను నితఁడు మనకు సహాయ మొనరించుతలఁపున వచ్చినవాఁడు గావున నితనిని వధింప నుద్యమించుట యిహపర లోకదూర మగు( గాన సైరింపుము.

(రుక్మి దిక్కై-

చ. ఎరు(గవె! జ్ఞప్తి లేదె? తల నిప్పటికిన్ గలపేమొ నాఁటియా
సురెనెఱిగంట్లు, గడ్డమును జుట్టును మీసలు నాఁడునాఁటికిన్
బెరు(గును గాని యేరికిని బీరము దాఁ బెరు(గంగ(బోదు నీ
తరము నెఱుంగ(జాల రని ధర్మజుతమ్ముల నాత్మ నెంచితే?.

చ. అరులకు నేను భీతి వడినప్పుగదా! కరుణించి నీవు మా
ర్తుర(బరిమార్ప(గాఁ గడగి( తోడుగ వత్తు నటంటి తప్పెఁ జూ!
తరుణము, నాఁడు ఖాండవము దగ్ధ మొనర్చెడిపట్టునందు న
వ్విరటునకై పెనంగునెడ విస్మృత మయ్యె భవత్ప్రతాపముల్.

నీయిచ్చ వచ్చిన కడకున్ బోవచ్చును. నీసాయము మాకుఁ గాబఁట్టదు.

క. కలఁ డిటఁ గృష్ణుం డని సి
గ్గులచే టని తెలియ వకట! కొంకర నో రె
ట్టులు వచ్చిన నట్టులొకో
పలుకుట యాలోచనంబు వలపదె రుక్మీ?.

రుక్మి- (తనలో) నే నిప్పుడ పోయి సుయోధను సైన్యాధిపత్యమ్ము వహించి వీ రాడిన ప్రల్లదమ్ములెల్ల ఫల్లములనె యుత్తరం బిచ్చెద(గాక. (యోజించి) అతఁడు(గూడ నన్ను వలదు పొమ్మనునేమో! అగు(గాక! యేమైనను "నేను పాండవులకు భయపడినవాఁడఁ నన్నుఁ గాపాడు"

మని యతఁడు నన్నుఁ బ్రార్థించిననే యంగీకరింతును గాని లేనిచో నంగీకరించుట యసంభావ్యమే.

(నిష్క్రమించును.)

తెరలో

శా. జన్యాయాతపరశ్వతానుగతరాజన్యాయుతాధీశమూ
ర్ధన్యత్వప్రతిపాదకంబులు నగారాల్ మ్రోయఁగాఁజొచ్చె ఛ
త్రిన్యాయంబునఁ బట్టి లార్చుచు ధరిత్రీజాతముల్ సేరె న
న్యోన్యంబున్ దెస లాడుమాట లన సైన్యారావ మొప్పారెడున్.

తే. గీ. ఎ యుద్ధం బటంచు పీ డెల్లయెడలఁ
జాటుచున్నారు పడవాళ్ళు స్వనము లెసఁగఁ
గృష్ణసారథికుం డగుజిష్ణు రేపు
చూతు మనుకొనుచున్నారు సురలు చదల.

(అందఱును నిష్క్రమింతురు .

గద్య.

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁ
బడిన పాండవోద్యోగమునందుఁ
పంచమాంకము.

.... ౦ ....

శ్రీమత్పరదేవతాయై నమః

# పాండవోద్యోగము

నాటకము

---

## షష్ఠాంకము



---

కృష్ణార్జునులు రథస్థులై ప్రవేశింతురు.



కృష్ణ: (కేలఁ జూపి)

చ. కంటివె భీష్ము! నల్లగురుఁ గాంచితె! గౌతముఁ జూచితే! ద్విష
త్కంటక! ద్రోణిమోముకళ గన్గొను మల్లదె! సూతపుత్రుఁ డొ
క్కంటఁ గురూద్వహున్ గలసి కయ్యపుముచ్చట లాడినన్ సఖా!
బంటులఁ బోటుమానిసులఁ బాఱఁగఁ జూడు మపారసంఖ్యలన్.

అర్జు: (అనుత్సాహమును సూచించుచు) జగన్నాథ! పరాత్పరావతార!

ఉ. కొందఱు బందుగుల్, గురులు కొందఱు, కొందఱు తమ్ము లిందులో
నందను లొక్కఁ డందరు, గనం దగుపోఁడిమి నందువారు రా
జ్యేందిరకై వృథాగ మన మిందఱ మ్రందఁగఁ జేసి యీ క్రియన్
డెందము రాయిగా సిరి గడించుటకన్నను బిచ్చ మొప్పదే!.

సీ. ఏమంచు వాలమ్ము లేయఁగాఁ గల నొక్కొ?
కన నొక్కొ పెదతాతగారితోడ

గురువుతో నేమంచు గ్రుద్దులాడుదు నొక్కొ !
యెద నొక్కొకింత కొం కొదవ డొక్కొ !
గురుసఖుఁ డటువాని గురుఁ డైనద్రుపునితో
రిపునితోఁబలె మోహరింతు నొక్కొ !
ఇద్ధమైత్రీకుఁ డశ్వత్థామతో మామ
తో మద్రనృపునితోఁ బొడరు టొక్కొ !

తే. గీ. పెద్ద తండ్రిగుమారుల పెద్దనిద్దు
రించుకయుఁ గొంచ కితఁడు పీడించు టొక్కొ !
బాహ్లికాది మహాసురు ప్రభులనెల్ల
భల్లముల నెట్లు డొల్లింపఁ జెల్లు నొక్కొ!.

కృష్ణు -- (తనలో) ఈ భీష్మద్రోణాది గురుపరంపరయు బాహ్లికాదిజ్ఞాతి పరంపరయు నితఁ డెందమ్మున కిట్టిమందత నాపాదించుట యొక యక్కజము గాదు. (ప్రకాశముగా) అర్జునా !

ఉ. ఇంతకుమున్న గాదె! నృప నీవు రణమ్మున రాయితంబుగా
నెంతయు నొక్కి చెప్పితి, వి దేమిటి కింతటిలోనఁ దావకో
దంతము మాఱె! నన్నయును దమ్ములు సిగ్గఱొక్కొ! వైరు లీ
వంత యెఱింగిరేని గరువంబులు వల్కరఁటయ్య! కవ్వడీ !.

ఉ. చంపెడివాఁడు గాఁ డొరఁడు, చచ్చెడివాఁడును గాఁ డొకండు, దే
హంపుస్వభావ మియ్యది, భవాత్యయముల్ గనుచుండు జీవుఁ, డీ
తంపులమారికాయమును దద్దయు నమ్మ కసంగుఁ డై మనుస్;
జం పొనరింపకే రిపులఁ జంపుము నీవు నిమిత్తమాత్రమై.

ఈ రహస్యమును వినుము. (చెవిలో నేమో చెప్పును.

అర్జు— తత్త్వవిద్యోపాధ్యాయ! వార్ష్ణేయ !

క. కులధర్మాతిక్రమణము
కలుషావహ మన్నమాట కడు శ్లాఘ్యమ యీ

ము కొ క్రై బ
రు గురులన్ జ ప ల్ల

ఉ. ఎందఱు రాజు లేలిరి మహేంద్ర మహావిభవంబుతోడ ము
న్నెందఱు రాజు లేలుదురొ! యేరికి శాశ్వత మొక్కొ? దీనికై
బందుల వంశవృద్ధుల నృపాలుర నన్యుల దేశికాదులన్
ద్రుంచఁగఁ జేయుపాపునకు మంచిగతుల్ పరమందుఁ గల్గునే ?.

క. ఏ నొకనిమిత్తమాత్రమ
కాని ధరాజాను లెల్లఁ గడతేరి రనం
గా నామది కెక్కదు యది
సూనృత మెట్లొనొ తెలియఁ జూపు మనంతా ?.

కృష్ణు- (తనలో) ఇతని కీసందియము విశ్వరూప ప్రదర్శనమ్మునం గాని నివ ర్తింపదు. (ప్రకాశము) అర్జునా ! ఒకసారి కన్నులు మూసికొని మఱి చూడుము

అర్జు- అట్లొనరించి మహాశ్చర్యముతో)

ఉ. ఎన్ని మొగమ్ము లున్నవియొ యెన్నిభుజంబులొ యెన్నిరూపులో !
కన్ను లవెన్నియో! యరట! కానఁగ వచ్చెడి భీతి హెచ్చెడిన్
జిన్నలుఁ బెద్దలున్ గలను జేయఁగ వచ్చినవార లెల్ల నా
పన్నులు గాఁగ నీయనఘువక్త్రములన్ బడుచుండి రోలిమై.

దేవా! నా యజ్ఞానంబు నివర్తించినది. నీవు లోకక్షయకర్త వగు రుద్రుఁడవు కాని యాదవపట్టభద్రుండవు కావు. నీచేఁ జంపఁబడిన యీ భీష్మాదియోధులఁ ద్విష్టపేష[illegible]ం బొనర్చుట నాయశంబునకుఁ గాని వేఱొండు కాదు. ప్రసన్నుఁడవై యీ రూపం బుపసంహరింపుము. (అని కనులు మూసికొని ధ్యానించి తెఱచును.)

కృష్ణు- (చిరునవ్వుతో) బావా! [illegible] చెప్పుదు ?

అర్జు : (సిగ్గుతో) నీవు యదునందనుఁడవు, మాపాలిటి కల్పవృక్షంబవు, శిష్టరక్షణ దుష్టశిక్షణ పరాయణుండవు, లీలామానుష విగ్రహుండవు, తత్త్వమసీత్యాదివాక్యబోధ్యం బగు నాగమమూలకందంబవు, నిన్నిదమిద్ధ మని నిర్ణయింప నే నెంతవాఁడను ? బంధుత్వకారణమ్మున నా యొనర్చు నపచారమ్ముల నన్నిటిని క్షమించి ప్రకృత కార్యాయత్తుండవై నాగ లెక్కు మున్నిచ్చినవరంబు గరంబు నెఱవేర్పఁ బ్రార్థించెదను.

కృష్ణ: (రథము తోలుట నటించి దృష్టినించి) ఫల్గునా! అటు చూచితివా! మీయన్న నిరాయుధుండును నిస్తనుత్రాణుండును సాంజలిబంధుండును నై కౌరవ బలమ్ములోని కరుగుచున్నవాఁడు. వెనువెంటన భీమ నకుల సహదేవ ధృష్టద్యుమ్నాది యోధులు ఱిచ్చపాటుతో నొకరియొకము లొకరు చూచుచుస్ బోవుచున్నారు.

యథోక్తముగా ధర్మరాజు ప్రవేశించును.

అర్జు : ఱిచ్చపాటుతో)

ఉ. "ఈనృపుఁ డింత బేలగునె! యిట్టిఁ డెటుల్ సమరావనీస్థలిన్
దా నడుగుంచె! నిందులకుఁ దమ్ములు సమ్మతి నెట్లుచూపి! రం"
చాననముల్ నిగుడ్చి నృపు లందఱు ప్రేలిడి ముక్కుమీఁద నెం
తేనియు సంశయాంబునిధి నీఁదఁగ నన్న యదేమొ యేగెడున్.

కృష్ణ: అందులకున్ దగినకారణము నేనెఱుఁగుదును, అజాతశత్రుండన సామాన్యుండుగాఁడు. ఈసంశయించు నృపాలుర కాతనిమనో వర్తనంబు గుఱుతింప నలవి కాదు. మనముగూడ నట కేగుదము రమ్ము. నిష్క్రమింతురు.)

భీము : అడ్డు వచ్చి

శా. అన్నా! యేమిటి కేడ కేగెదవు? దైన్యం బంద నీకేల? నీ
వెన్నన్ జూచి రిపుల్ దిరానిక నగస్; దేవాసురుల్ వచ్చినన్

పుమా !

బన్నం బ

వెన్నున్ జూడుమ

ధర్మ : ఒప్పించుకొని నిరుత్తరుఁడై పోవును

నకు : (అడ్డము వచ్చి)

శా. ఏ నుండఁగన్ భయ మేల? నీ కనికి రానీ! సర్వలోకమ్ములున్
గానీ యింక మహేమ యైన మనకున్ గన్నాకు కృష్ణుండు లేఁ
డే? నేఁ డేమి పోసంగెఁ గ్రొత్త, విలుకాం డ్రెవ్వానిపై ర్విన్నమా
త్రానన్ మానముఁ బ్రాణమున్ విడుతు రాధన్విన్ నరున్ జూడుమా.

ధర్మ : (యథాప్రకారమె పోవుచుండును.

సహ : (అడ్డమువచ్చి)

ఉ. పన్నిన మొగ్గరమ్ములు "సెబా సిది యే" మని ముక్కు ఁ ఁవేలితో
నిన్నును మమ్మునున్ దెగడ నీ కిటు రిత్త చనంగ నేల యో
యన్న! కనం గదన్న! మము నాఁడిది పుచ్చకుమన్న యేటి కీ
బన్నపు సేఁత వెన్ను నకుఁ బార్థునకున్ దలవంపు నింపఁగన్?.

ధర్మ : (పోవుచుండును.)

భీము : (మరల నడ్డమై)

ఉ. తాతకు భీతిఁ జెందితివొ? ధన్విపతంసగురుండు ద్రోణువి
ఖ్యాతికి లోఁగిపోయితివొ? గౌతమతీవ్రత కోహటించితో?
చేతము ద్రౌణివిక్రమవి శేష మశేష మెఱింగి లొంగెనో?
యాతఁడి నీ తెఱంగు గన నేటికి! నేఁటికిఁ క్రొత్త లున్నవే?

భీష్మ: ప్రవేశించి) ఓ సేనానాయకులార !

శా. కాయం బెన్నటికేనిఁ బోవునదియే ఖాయంబు నాఁ జెల్ల దే
రేయో! ప్రొద్దుటనో యెదో విధమునన్ రే పేని యెల్లుండి గా
నీ యేరోగ మొ మూఁడి చచ్చిన ఫలం బేమున్న? దాలంబులో
నాయుర్దాయము ధార వోయుఁడు దివం బందుం డనిందార్హులై.

భీమ- యోజించి) సోదరులారా! శయనము తాత్పర్య మిదమిద్ధమని నిశ్చయింప రాకున్నను గురులన్ దర్శించి తదనుజ్ఞ వడయుటకై యరుగుచున్నట్లు లూహింపనయ్యెడిని. నే నియ్యెనముతో నున్నం జాలును గాన మీ రీయుదంతంబు మురాంతకునితో విన్నవించి కర్తవ్యంబు నిర్ణయింపుఁడు.

(నకుల సహదేవులు నిష్క్రమింతురు.

ధర్మ- (భీష్ముని సమీపించి)

క. సాయకరహస్యకృతినే!
శ్రీయుతకీర్త్యబ్ధిశంభుశేఖరమణయే!
భూయో భూయోఽపిచ గాం
గేయాయ! నమో మహాత్మగేయాయ నతే.

నమస్కరించును.

భీష్మ- గ్రుచ్చి కవుఁగిలించుకొని సంతోషముతో

ఉ. వచ్చితి మేలు చేసితి, భవచ్చరితంబు ననారతంబు నే
మెచ్చుట కాక దేవతలు మెచ్చరు, రన్యులు మెచ్చకుందురే?
నచ్చిన మేటిపన్నఁడవు నాయన! నీ విటు రాకయున్నచోఁ
జెచ్చెర శాప మిచ్చియె నశింపఁగఁ జేయుదుఁ జుమ్మి మిమ్ములన్.

క. పురుషుం డర్థమునకుఁ గిం
కరుఁ, డర్థము పురుషదాసి గా దెన్నఁడు; నీ
తరపున దురమొనరించుట
తరువాయిగఁ గోరు మిత్తుఁ దగ నేదైనన్.

ధర్మ- అంజలి ఘటించి)

ఉ. కోరుట కేమి యున్నయది! కొండొకకోరిక; నిన్నెదుర్పఁగా
నేరికి శక్యమౌ! దివికి నేగెడివారికిఁ దక్క; నాజ్ఞ యి
మ్మా! రణ మాచరించుటకు; నాదరమేదుర మైనవృత్తి చె
న్నారఁగ దీవనల్ సలుపుమా! యనిలో జయ మందితీరఁగన్.

క. పెంచితివి, పెద్దజే ుతి,
వంచితముగ పంచితిని, మహామహు(ా ౼, న్
గొంచక యెదిరించెడి యీ
కొంచెపుమానిసుల లోభగుణ మెంచకుమా !.

ఇఁక నొకపునవి. (చెవిలోఁ జెప్పుట నటించును.

భీష్మ- చిరునవ్వుతో)

ఉ. నన్నెదిరింపఁగాఁ దగిననాయకుఁ డీభువనత్రయంబునన్
సున్న, వధించు టెంత నెటు చొప్పదుఁ? జాపము మత్కరంబునం
దున్నపు డీవనిన్ నలుపనోపుట రుద్రునకేనిఁ గాదు; నేఁ
డెన్నఁగ దీనిఁ గోరఁ దగ దిప్పటి కేగుము రమ్ము క్రమ్మఱన్.

ధర్మ- చిత్తము సెలవిమ్ము.

భీష్మ- పొమ్ము నీకు జయ మగుఁగాక ! (దెసలు పరికించి తేఁ డెందులకో నావంక, జూచుచున్నాఁడు. అట కేగెదఁ గాక ! (నిష్క్రమించును.)

ధర్మ- (తనలో) ఇట్లే ద్రోణులంగూడఁ బ్రసన్నులు జేసికొనినంగాని జయంబు సాధ్యంబు గానేరదు. (పరిక్రమించును.)

ద్రోణు- (ప్రవేశించి) ఓయేకాదశాక్షౌహిణీపతులారా! సేనలారా !

చ. నలువుఁడు యుద్ధ మించుకయు శాస్త్రవిరుద్ధము గాకయుండఁ, బే
గలిగి చరింపుఁ డెయ్యెడలఁ, గయ్యపువస్తువు లంది యిచ్చువా
ల రణ రికాచరపరంపరలన్ బయిఁ జూడ వచ్చువా
రల నలయింపఁ బోకుడు, ధర మ్మగు జుం డపకీర్తి తేనికిన్.

ధర్మ-- (తనలో వీరే ద్రోణులు. (సమీపించి సాష్టాంగ నమస్కార మొనర్చి

క. ద్రోణాయ! శిష్యకోటి
త్రాణాయ! ధనుష్మదధికదర్పాపహార

ప్రాణాయ! శిష్యకల్పిత
బాణాయ! నమోఽస్తు దేవ! భవతే గురవే!

ద్రోణు: (లేవనెత్తి కౌఁగిలించికొని)

ఉ. వచ్చితి మేలు చేసితి, భవచ్చరితంబు సనాతనంబు నే
మెచ్చుట కాక దేవతలు మెచ్చుదు రన్యులు మెచ్చకుందు రే!
నచ్చిన మేటిశిష్యుఁడవు నాకడ కీ విటు రాకయున్నచోఁ
జెచ్చెర శాప మిచ్చియె నశింపఁగఁ జేయుదుఁ జమ్ము మిమ్ములన్.

క. "పురుషుండర్థమునకు" అను వెనుకపద్యము చదువును.

ధర్మ: (అంజలి ఘటించి ఉ. "కోరుట కేమియున్న యది" అను వెనుకటిపద్యము చదువును.)

క. తద్దయు ననుగ్రహమ్మున
విద్దియ నేర్పితిరి, నేఁడు వీరులమై మీ
యొద్ద న్నేర్చినవిద్దియ
లద్దిరె! మీ మీఁదఁ జూపు టది సైఁపఁదగున్.

ఇఁక నొకమనవి. (చెవిలోఁ జెప్పును.

ద్రోణు: (చిరునవ్వుతో)

ఉ. నన్నెదిరింపఁగాఁ దగిననాయకుఁ డీభువనత్రయమ్మునన్
సున్న, వధించు టింక నెటు చొప్పడుఁ? బాపము మత్కరంబునం
దున్నపు డీవనిన్ నలువ నోపుట రుద్రున కేనిఁ గాదు, నీ
యున్నతి గోరునాకు నిపు డొప్పు నుపాయము సెప్పి పంపుటల్.

ఏను వినరానిమాట వింటనేని యస్త్రసన్న్యాసంబు గావింతు. దానిం జెప్పువాఁరు సత్యభాషాహరిశ్చంద్రుండై యుండవలెను.

క. ఎందులకుఁ గోరెదవు? గో
విందుఁడు నీపట్లఁ గలఁడు, వెఱ్ఱిపడకు మీ
చందం బయశస్కర మగు
నెందును విజయంబు మీక యేర్పడి యుండెన్.

(మ- వినయముతో) దేవర య...
రము. సెల విండు. మఱియుc గృపాచార్యుల... మ ...
భూపతినిం గూడ దర్శించి వారలయనుజ్ఞ వడసి యరిగెదను.

ద్రోణు- (తనలో) ఇతcడు కడునుపాయశాలి; రాజనీతి దురంధరత్వమునc గృష్ణుని తరువాత నితనినే చెప్పవలయును. కృపునింగూడ వధోపాయం బడుగవలయు ననియు శల్యునికిc గర్ణసారథ్యంబు రాcగలదని యెఱింగిన వాcడు గావున నప్పట్లc దోcచినసాయం బొనరుపు మనియుం గోరc దలం పుదయింపcబోలు! నందులకై యరుగుచున్నాcడనుట ధ్రువము. అగుcగాక, యెట్లును ధర్మమే జయించcగలదు.

ప్రకాశము

. నీమదిc గల్గువాంఛితము నే నొక యింత యెఱింగినాcడc జు
మ్మోమహితాత్మ! గౌతమునికొప్పదు మృత్యువు నీపయిన్దయన్
గోమలచిత్తుc డాతc డది గోరిననున్ సమకూర దూర కే
నేమిటి కీ ప్రయత్న? మిcక నేగి సమీకము నిర్వహింపుమా.

నర్మ- సర్వజ్ఞుల రగుతా మెఱుcగని ధర్మములు లేవుకదా ?

ఉ. అమ్మహితాత్ముc డట్టిcడని యాత్మ నెఱుంగక కాదు, శాస్త్రదూ
ష్య మ్మగుcగాన నొజ్జ యగునయ్యనఘున్ బ్రణమిల్లి యాజ్ఞమా
కి మ్మని వేcడి దీవనల నిట్టులె కైకొని యేగువాcడ, ద్రో
హ మ్మది యొజ్జ పట్టున జయ మ్మగునే! తగునే? కృతఘ్నతల్.

ద్రోణు- అ...యిన ...రమ్ము. ధర్మజభీములు నిష్క్రమింతురు.

ధర్మ- మరలc బ్రవేశించి తనలో ఇక్కడికి గురుజనంబులనెల్ల నారాధించి వారి యాశీర్వచనమునన్ బడసితిని. ఇcకc గడమ యేమున్నది! యోజించి) ఇట్లగుc గాక. ఉపాయములలో నెల్లc దృతీయోపాయము విజయాపహమని రాజనీతిధురంధరులు వచింతురు. కావున నందులకై గూడ

యత్నించి చూచెదఁగాక! ప్రకాశముగా బిగ్గరగా ఓ కౌరవచమూపతు
లారా!

శా. నాకై యల్లసుయోధనున్ దొడరుసన్నాహంబు వాటించు వా
రీకౌరవ్యబలమ్మునందుఁ గలరే! యెవ్వారలే నున్నచో
నీకాల మ్మది దాఁటనీకుఁ డిపుడే యే తెండు నావెంటలో
కైక త్రాణధురీణుఁ హరిమర్యాదన్ గనుం డింపుగన్.

యుయుత్సుడు : (ప్రవేశించి

శా. అన్నా! యే నిదె వచ్చుచుంటి భవదీయం బైనపక్షంబు చే
ర న్నాకిష్టము మెండు నీకయి రిపువ్రాతంబు మ్రందింతు నా
జి న్నీవంటిమహానుభావునకునై జీవంబు వో నాడినన్
దన్నున్ మెచ్చెద రెల్లవారు పురుషార్థం బింత కొం తుండునే?

క. అవె నాసైన్యంబులు నీ
యవి నే నీవాఁడ నీకు నాహవమునఁ దో
డపుటకు నోఁచినమామక
భవ మతిపూతంబు సర్వవంద్యం బధిపా!

ధర్మ : (సబహుమానముగాఁ గౌఁగిలించుకొని

తే. గీ. తమ్ముఁడా! రమ్ము పాండుపుత్రకులపంచ
తను దొలంగింపు మూర్గురు తనయు లింకఁ
గుంతికిని బాండునరపాలకున కటంచుఁ
జెప్పికొని లోక మిఁక సంతసించుఁగాక.

ఇరువురు నిష్క్రమింతురు.

ద్రోణు: తనలో ఈధార్తరాష్ట్రులలో నెల్ల నీ యుయుత్సుఁడే శోభించువాఁడు.
వీనియెడల శ్రీకృష్ణుఁడు సోదరభావము ననుగ్రహించుఁగాక (చూచి ..
ఢెందులకో వారిదిక్కు చూచుచున్నాఁడు, నిష్క్రమించును.

కృష్ణ: ప్రవేశించి ... ... ... గ
సం హరించినాఁడు, కాని కర్ణుఁడు ...
సుంతైనఁ జోటిచ్చినవాఁడు కాఁడయ్యె ? ఇఁవల భీష్ముఁడు తన్నర్థ
రథులలోఁ జేర్చె ననుకోపమున నతఁడు యుద్ధ మొనరించుదినములలోఁ
దా నుదాసీనుఁడై చూచుచుండుట కేర్పఱచుకొన్నట్లు వినియుంటిమి. కావున
నతని నెట్లేని విఱిచి యీపక్షమున కీదినములలోఁ జేర్చుకొంటిమా !
యితనిచేఁ గొంత వఱకుఁ గురుబలము నశించుననుట కించుకయు సంది
యము లేదు. యోజించి కాని దుర్యోధనుఁడే తానుగాఁదలంచునతఁ డీప
న్నుఁగడకు సమ్మతింపఁడు. తలపంకించి అగుఁగాక ! "యత్నే కృతే
యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః" ప్రరిక్రమించును.

కర్ణ: ప్రవేశించి ఓ సేనాధిపతులార! యోధులార!

చ. శర ఋనువారిఁ గాని శరచాపవిహీనులఁ గాని భీతిమైఁ
బరుగిడువారిఁ గాని శరబాధకు మూర్ఛిలువారిఁ గాని త
త్తఱపడువారిఁ గాని పరితాపపరీతులఁ గాని నిర్దయన్
బోరిఁగొనఁ బోకుఁ డట్టిక్రియఁ బోరుట నారక కారకంబగున్.

కృష్ణ: (సమీపించి జనాంతికము) బావా !

క. నిన్నర్ధరథులలోన ము
రున్నదితనయుండు చేర్చ రోషించితి నం
చు న్విన వింటి నీకున్
జన్నె మన్నని కత్త్ర సన్యాసంబుల్

చ. జరిగినదాని కేమి! యొక చక్కని త్రోవ వచించు నారకే
యరయుట శౌర్యవంతునకు నాలమునన్ గడు సిగ్గు గాదె? మా
కరివిజయమ్ము పట్టున సహాయ మొనర్చినయట్టు లౌను నీ
కరి యగు భీష్మునన్ దొడరినట్టులు నా జనుదెంతుపే యిట్టుల్,

ఉ. ఇంతరుఁ దప్పు పేఱొకటి యేదియు లే దిఁక భీష్మమీఁద వి
క్రాంతిని నీవు చూపుటకుఁ; గయ్యము మీ కెటుసంఘటించు? నీ
స్వాంతమునందు సుంత గనుమయ్య! ధనంజయతుల్యు నిన్ను దు
శ్చింతనుఁ డింత కొంచెపఱచెన్ సయిరించుట యెట్లు మానికిన్.

క. గాంగేయుఁడు చచ్చెడిదాఁ
కం గౌంతేయులకుఁ దోడు గ మ్మిటు నీవా
ప్పం గంటివేని ఋణవిము
క్తిం గందువు తల్లిపట్లఁ, దీఱును బగయున్.

కర్ణ- (తనలో) ఔరా! యీకృష్ణు డెంతటిమాయావి.

ఉ. ఏ నలభీష్ముచేఁ బడిన నీతని కిష్టమె, యమ్మహాత్ముఁ డె
ట్లేని మదీయనాగశరకృత్తశిరుం డగు నేని దానికిన్
వీనికి సంబరంబె! నను వేఁదుఱుగాఁ దలపోసె నౌర్కా! యే
మైనను శక్తియున్ ఫణియు నర్జునుఁదక్క నొరున్ వధించునే?

ప్రకాశము

ఉ. చెప్పితి ఉత్తరం బిడితిఁ జెచ్చెర నింతకు మున్న మొన్న, యీ
చొప్పిపు దేల చొప్పడెడి? శూరులు దూఱరె నన్నుఁజూచి? యె
ట్లొప్పదు! నీ శరీరము సుయోధనుపా లొనరించి దీని? కే
నప్పుడు కోపగించినను నాగ్రహ మున్నదె నాకు భీష్మపై?

క. భీష్ముండు పైరివీర
గ్రీష్మాదిత్యుం డతఁడు గెలువఁడె మీమీ
యూష్మములనెల్ల నలయ
ర్చిష్మంతుం డడవి బూదె చేసినభంగిన్.

కృష్ణ- (ఏకసక్కెముగా

తే. గీ. వేయిమంది భీష్ములు పదివేలమంది
ద్రోణులును నూఱు వేలు కర్ణులును గలసి

వచ్చినను బార్థుచేతిలోఁ జచ్చువారు
కృష్ణుఁ డన నెవ్వఁడో సుంత యెఱిఁగికొనుము.

నిన్ను హస్తినాపురసార్వభౌమునిం జేయఁ దలఁచి నాయొనర్చిన ప్రయత్నము నీయంతరాత్మయుఁ బరమాత్మయు దక్క నొరు లెఱుంగరు. నా యావచ్ఛక్తియు వినియోగించి నీ మేలునకై దొరలితిని. ఇంక నాపలన నీకుం బ్రియం బేమున్నది? అయినను నిట్లగుఁగాక.

(భరతవాక్యము)

మ. కలుగుంగావుత నీకుఁ దక్క నృపభక్తశ్రేణియు దాయతుల్,
[illegible] గావుత ధర్మ మెన్నటికి, వాగ్దేవీ మహత్త్వంబు లి
క్కలికా[illegible] రతాశ్రయము[illegible] కావ్యంబులై నాటకం
బులునై [illegible] [illegible]యు [illegible] గాలోకమం దెల్లెడన్.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్యత్కవిబాలకలావిధి
బాలసరస్వతీశతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే
రచింపఁ బడిన శ్రీ పాండవోద్యోగమ్మునందు

షష్ఠాంకము.

సంపూర్ణము.